గీ॥ సరిగ ధని సగమ పనినిసరిగగరిమ
మరి మరిగ పాపనినిగని సరిసరియను
వీణ కాని 'మా, వెన్క 'నీ' వీణవమన
మీఁదొ 'నీ, వెన్క 'మా, సూర్యమేదినీశ.

పిఠాపురము.
9-11-09.

పానుగంటి లక్ష్మీనరసింహరావు.



# ఈనాటకమున వచ్చుపాత్రలు.



## పురుషులు.

పురుకుత్సుఁడు — కథానాయకుఁడు.

విదూషకుఁడు.

చిత్రకేతుఁడు — గంధర్వుఁడు.

అంశుమంతుఁడు — ఉరగలోకరాజుయొక్క ప్రధాని.

విశ్వామిత్రుఁడు — ముని

నారదుఁడు — ముని

ఇంద్రుఁడు.
చంద్రుఁడు.
బృహస్పతి.
సూర్యుఁడు. } దేవతలు.

మందారుఁడు — ఉరగలోకరాజు.

సూత్రధారుఁడు — అంతరనాటకములోనివాఁడు.

## స్త్రీలు.

నటి — అంతరనాటకములోనిది.

శచి — ఇంద్రునిభార్య.

సుమతి — పురుకుత్సునిదేవి.

కల్యాణి — సుమతియొక్క చేటి.

నర్మద — కథానాయకురాలు.

నవమాలిక — నర్మదయొక్క చేటిక.

శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.

నాంది

ఉ. అందఁగరాని సీమలకు ♦ సంగఁగఁజేసి ఘటింపరాని రీ
తిం దనరారు కార్యముల ♦ తిత్వరితంబుగ సంఘటించి ర
క్తిం దెరపైని బొమ్మలటు ♦ తై తెయితక్కలనాడఁజేసి స్వ
చ్ఛందముగాఁగ జీవతతి ♦ సాకెడు లోకవిభుం దలంచెదన్.

సూ—(ప్రవేశించి) పారిపార్శ్వకా!

పారి—(ప్రవేశించి) పిలువనక్కఱలేదు. కానివృత్తికై మనకేర్పఱుపఁబడిన లెంలు తెయితక్కలు మనకు నివృత్తియందుఁగూడఁ దప్పవాయేమి!

సూ—(నవ్వుచు) ఇప్పుడాడఁబోవు నర్మదాపురుకుత్సీయనాటకమెవరు రచియించిరో యెఱుఁగుదువా?

పారి—ఎఱుఁగుదును పానుగంటి లక్ష్మీనరసింహారావు.

సూ—ఔను ఇదియాతని ప్రథమనాటకము ఆతఁడేమతమునబుట్టెనో యెఱుఁగుదువా?

పారి—ద్వైతమతమునఁగాదా

సూ—ముక్తిదశాసందర్భమునఁ దన్మతసాంప్రదాయము కొంచెము హెచ్చుతగ్గుగ నీవనినట్టిదేకద!

2

(నేపథ్యమున) ఓహో!

సూ—మతసాంప్రదాయములు పూర్ణముగఁ దెలియకముందే మీరుచేసిన సిద్ధాంతమునకు వెనుకనుండి యెవ్వఁడో మహానుభావుఁడా మోదమా?

(నేపథ్యమున) ఎవ్వఁడో మహానుభావుఁడీసమయముందే యూర్ధ్వలోకమునుండి యిచ్చటికి విచ్చేసినట్లుతోఁచుచున్నది.

పా—నాటకమారంభమైనది పాతాళవాసియగు సంశమంతుఁడు స్వర్గవాసియగు చిత్రకేతునిగూర్చి యిట్లుపలుకుచున్నాఁడు. మనము లోనికిఁ బోవుదము.

(నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన.

శ్రీ

# సర్వదా పురుషత్రయము.

ప్రథమాంకము.

రంగము—విశ్వామిత్రాశ్రమపరిసరారణ్యభూమి.

[ఊర్ధ్వలోకమునుండి చిత్రకేతుఁడును, నురగలోకమునుండి యంశుమంతుఁడు నేక కాలమున చెఱియొకవైపునకుఁ బ్రవేశించుచున్నారు.]

అంశు—ఓహో! ఎవ్వఁడో మహానుభావుఁ డీసమయమందే యూర్ధ్వలోకమునుండి యిచ్చటికి విచ్చేసినట్లు తోఁచుచున్నది.

గీ. ఉరగదేవలోకంబుల ♦ నుండి యొకట
దిగిలి మిచ్చట వేర్వేఱు ♦ దిక్కులందు
ప్రాగ్గిరి శశి, ప్రతీచిని ♦ భాస్కరుండుఁ
బూర్ణిమాసంధ్య నొకసారి ♦ పొలుచునటుల.

అతనిసమీపించి యెవ్వరో తెలిసికొనెదను.

(సమీపించి) నమస్కారము మహానుభావా!

చిత్ర—మహానీయా! అనేకనమస్కారములు.

గీ. ఎవరు మీరని యడుగంగ ♦ నితనిజిహ్వ
సంభ్రమము నొంద మనసు త ♦ త్సంభ్రమంబు
బాపలేదయ్యెఁ గళ్లెంబు ♦ బలిమిచే న
వారుబట్టిన దాఁటున ♦ శ్వంబుఁబోలి.

చిత్ర—అట్టి కార్యవైచిత్ర్య మేమియుండు నని నే నడిగిన మన్నింతురుగాక.

అంశు—అయ్యా! మఱి యేమియు విశేషము లేదు.

గీ. పసిమిమిసమిసకల క్రొత్త ◊ వయసు పెసంగు
సుతను నర్మద కనుకూల ◊ పతిని గూర్చ
వంతచే నున్నవాఁడను ◊ బహుమఁ గాంచు
వారి కందఱ కిది తల ◊ వ్రాత కాదె?

చిత్ర—కర్ణములకు భూషణములుగ మీనర్మదాసౌందర్యకథన మెన్ని మాఱులో వినియున్నాను.

ఆ. వె. అట్టిదాని నీయ ◊ నగుఁ జక్రవర్తికి
పదున కీయరాదు ◊ సురల కొసఁగ
కంబుజాక్షునకునె ◊ యచ్ఛసాలగ్రామ
మాల భర్తుఁ డిచ్చు ◊ మాడ్కిఁగాఁగ.

అంశు—ఓహో మిత్రమా! చక్రవర్తిగాని బాగుగ జ్ఞాపకము చేసితివి! ఈమహీకాంతుఁడు తన భుజ[illegible] జేకదా! అతఁడును మహాభాగ్యసంపన్నుఁడును, విశేషశేముషీసనాథుండును, సర్వగుణసంపూర్ణుఁడును, కాంతాజనమోహనమనుమసా [illegible]యుండు నని శ్రవణానందకరముగ విన్నవాఁడనే కాని నేత్రసాఫల్యముగఁ జూచియుండలేదు మిత్రమా! మీ రెప్పుడైనవాని నిం జూచితిరా?

చిత్ర—మహా[illegible] నిత్యానందమునుగూడ జూచితిని. కొన్ని దినముల క్రిందట నొకనాఁడు,

గీ. వేఁటనొకఁ డిరుచేతుల ◊ నిడుగవను
బట్టి కరిరాజసంఘుంబు ◊ భంగపఱచె
బాలభానుండు దనకిర ◊ ణాళిచేత
నంధకారంబు సమయించు ◊ నట్లుగాఁగ.

(అంత తెరలోఁ బెద్దకలకలము.)

గీ. భవ్యతేజస్కు నీచక్ర ♦ వర్తిఁ గాంచి
యాటవికజంతువులు చేష్ట ♦ లణఁగి సొలపి
పక్షిరాజేంద్రు నీక్షించి ♦ పడగ లవని
వ్రాల్చి నిశ్చేష్టతను బొందు ♦ పాములట్లు.

అంశు—ఓహో! ఏమి నాయదృష్టము! మిత్రమా! ఆమహాచక్రవర్తి వేఁటమార్గమున నియ్యెడకే వచ్చునట్లు తోఁచుచున్నది.

గీ. ఆతనిని నేను దర్శింప ♦ యత్నపడఁగ
నాకడ కతండె వచ్చుచుం ♦ డంగఁబోలు
ఫలము గ్రహియింపఁ జూతాగ్ర ♦ భాగ మెక్క
నుండఁ దటుకునఁ జేఁబడు ♦ పండురీతి.

చిత్ర—మిత్రమా! అట్లుచూడుము! అట్టి యపూర్వదర్శనమువలన యథార్థముగ సఫలుఁడ వైతివికదా.

గీ. వెడదయురమున గిరజాలు ♦ వ్రేల సూక్ష్మ
మధ్యుఁడై వచ్చు నల్లదె! ♦ మందసఖుఁడు
వెంటరా, నక్కపోతుతా ♦ వెంటనంటి
రాఁగ విహరించు కేసరి ♦ రాజుపోల్కి.

అంశు—ఈమహారాజు నే నెన్నఁడును జూచియుండకపోయిన నీ నిమిష మందీతని దూరమున నుండి చూచినంతమాత్రముననే చెప్ప నలవికానియనురాగమును, బంధుప్రేమయు నీతనియందు నా కేమో యకారణముగఁ గలుగుచున్నది.

చిత్ర—సఖుఁడా! అట్టివికార మందఱకును సహజమేసుమా!

గీ. పుణ్యసంబంధములు రాక ♦ మునుపె వాని
భావిఫలములు కించిత్తు ♦ పరిఢవించు

వర్ష రహిత మైనను మృగ ♦ శీర్షయుక్తి
వసుధ కిసుమంత యుపశాంతి ♦ వచ్చుఁ గాదె.

కావున మిత్రమా! నీయీమనస్థితినిఁబట్టి చూడఁగ మీనర్మదకీ తఁడు పతి కాఁగలఁ డని తోఁచుచున్న దిసుమా!

అంశు—నీయూహ యీరాజరాజుగూడ స్థిరపఱుపవలెనుగదా. మిత్ర మా! తిరస్కరిణిచేఁ బ్రచ్ఛన్నుల మై యిక్కడనే యుండి వీరిసం భాషణము విందము.

చిత్ర—అట్లే.

(అంతట రాజును విదూషకుఁడును బ్రవేశించుచున్నారు.)

విదూ—విస్తరిలో వడ్డించినభక్ష్యములను దినలేక గ్రుక్కు మిటకరించు కొని యటునిటు జూచువానివలె సొమ్మసిలి భీతిచే నిశ్చేష్టతను బొంది పాదాక్రాంతము లైనవేఁటజంతువులను జంపలేకపో యితివి!

పురు—(నవ్వుచు) అహా! విప్రవర్యా! శూరధర్మము నెంతబాగుగ వె ల్లడించితివి! గర్వాత్ములకు గాక సవినయులకు శిక్ష యేల?

అంశు—ఈచక్రవర్తి మృదుమధురగంభీరభాషణములు నామనస్సునకు సంగీతమువలె నాహ్లాదమును గలుగఁజేయుచున్నవి.

విదూ—అటులైన మిత్రమా! అందఱును బైరాగులైన నూరఁబ్రాల దండ లమ్ముకొనువానికావడిమోఁత యెంతసార్థకమో నీధను ర్భారమును నాకఱ్ఱమోఁతయు నంతసార్థకమే కదా?

అంశు—మిత్రమా! ఇంతదివ్యమంగళవిగ్రహమును నేను చూచియుండ ను. ఇతఁ డల్లుఁడుకాఁగలమహాభాగ్య మురగలోకాధిపతి కెన్నఁ డగునోకదా.

పురు—మిత్రమా! ఇంతకుముందు మనము సంచరించినయరణ్యభాగ ముకంటె నీయరణ్యభాగము విలక్షణముగ నున్నది.

సీ. ఫలసారమునఁ జెల్లు ♦ నాగేటి పర్వత,
త్త్వజ్ఞానమునఁ దవి ♦ ద్యాపల్లి
కొండనెత్తమ్ముల ♦ నుండి సరిమ బారు,
సిరిపులకరుహార ♦ సమ్మృభంగి
నశీతయుతతరు ♦ లలపుల రాల్చక,
లసపూజలులు సూత్ర ♦ ధములవలెను
వివిధపక్షులకల ♦ రవము లేరంబులు,
భాష్యంబులు మీఱ ♦ నా శివలెను
గీ. పచ్చికలయస్సు, కొలఁ ♦ కులు, ధర్మలతలు,
జాజిమంకెనలపొదలు ♦ సరసవస్తు
లగలి పాల్లు ననమహా ♦ లక్ష్మినెడను
మంజులరుచులు తాల్చు ♦ మాలవీల.

ఓహో! మిత్రమా! నీమనఃపూర్ణ కీవనశోభ యెక్కువన్నదికాఁ బోలు నేమి?

గీ. సరసునది కెక్కు వరవస్తు ♦ సారశోభ
మూఢునది కెక్కునే? రాజు ♦ బుద్ధిలోనఁ
బ్రతిఫలించెడు దీపిక ♦ ప్రభోమ్ము
రాలిలోపల నేరీతిఁ ♦ బ్రతిఫలించు?

విదూ—వాతో మాటలాడుటకు నాకు విరహబాధ భరింపశక్యము గాకుండ నున్నది

పురు—రసహీనుఁడ నని యాక్షేపించితి వనియా! విరహభారవశుఁడ నైతి నని చెప్పుచు రసజ్ఞత కొనితెచ్చుకొనుచున్నావు?

గీ. వస్తుపుగుణగ్రహణశక్తి ♦ భవముతోడఁ
బుట్టవలెఁ గాక కొనితెచ్చి ♦ పెట్టఁ గలమె?

చిత్ర—గీ. వరధనుఃపాణి యగుచు ర ♦ వలతురాయి
దాల్చి సఖుతోడ నీరాజు ♦ పొల్చుచుండె
వీఁక భృంగితోఁ గూడుపి ♦ నాకపాణి
యైనచంద్రార్ధశేఖరు ♦ ననువు మెఱసి.

అంశు—ఆ. అట్టిశంకరునకు ♦ నర్ధాంగలక్ష్మిగాఁ
దుర్గ యయినరీతి ♦ దురితదూరుఁ
డితని కురగరాజ ♦ సుత దేవి యగునట్లు
హితులు మును లమగ్ర ♦ హింత్రుగాక!

చిత్ర—హోమధూమవాసన కొట్టుచున్నది. సమీపారణ్యభాగము మున్యాశ్రమ మైయుండమకదా!

అంశు—అయినఁ బ్రమాద మేమి?

విదూ—నీవుచెప్పిన పుష్పించినయశోకవృక్ష మిప్పటికి నాకంటఁ బడినది.

పురు—ఇంకను బాగుగఁ బరిశీలించుము.

విదూ—మిత్రమా! జంతు వని భ్రమసితివిగదా! సున్నమున్నఁ బూయుటచేతఁ దెల్లఁబడినకుండపై మసిబొట్లను బెట్టి యీయశోకవృక్షమునకు దృష్టిదోషము తగులకుండ నెవ్వరో దానిమొదట నుంచినదృష్టిపిడతసుమా!

చిత్ర—నీకంటె దృష్టిపిడత మఱెవరు?

పురు—గీ. పచ్చనిశరీరమున జిల్గు ♦ మచ్చ లొలయఁ
గంధరము సాచి తనముందు ♦ కాలుదువ్వి
చెవుల వెనుకకు నిక్కించి ♦ చెలఁగి నీరుఁ
ద్రావుచున్నది చిందువై ♦ తనరవచ్చు.

అయినను మిత్రమా! దానిపార్శ్వభాగముమాత్రము కొంచెము కనఁబడుచున్నది. నీవుకూడ జాగరూకతతోఁ గనిపెట్టుము.

విదూ—ఇఁక కనిపెట్ట నవసరములేదు అదిగో! ప్రేలరియొక్క నాలుక వలె బాణముతోఁకకూడ నాడించుచున్నది.

పురు—తల మిక్కిలి చిన్నదిగను, తోఁక మిక్కిలి పొట్టిదిగను, కనఁబడుచున్నది చిఱుతపులి కాదని తోఁచుచున్నది.

విదూ—అలాగున నూహింప వీలులేదు. బుద్ధిహీనమైన చిఱుతపులికి తల చిన్నదిగనే యుండును. శూరుఁ డెవ్వఁడైన తోఁక నఱికి యుండవచ్చును. ఈదినము వేఁట లుబ్ధునికడ యాచనవలె శూన్యమును, మీఁదిమిక్కిలి లజ్జాకరము నైనదికావున మిత్రమా! శీఘ్రముగా బాణమును సంధించి టంగున రాతితో గొబ్బరిత్తుచ్చె నూడఁగొట్టునట్లు దానితలఁ గొట్టుము.

పురు—ఇదిగో! బాణము సంధించితిని. (కొంచెమునే పూరకుండి) మిత్రమా! ఎందుచేతనోకాని మనస్సు మిక్కిలి కలతనొందినదిసుమా!

గీ. తోఁచ కొకపరి దిరుగు డొం ◆ దుచును మఱియొ
కపుడు కుతికలఁబడును ధై ◆ ర్యంబు దక్కి
ధైర్య మూఁతగ నొకసారి ◆ ధాటిలేచుఁ
బైకి నుసిగుండమునఁ బడు ◆ వానిఁ బోలె.

విదూ—నే నిప్పుడు బాగుగఁ బరిశీలించితిని. చిఱుతపులియే గాని వేఱొండుగాదు. తలక్రిందుపక్షులు జేరి చెట్టును పాడుచేసినట్లు లేనిపోనిసందేహములు మనస్సును బాడుచేయును.

పురు—మిత్రమా! నాయెడమకన్నదురుచున్నది. ఏమికీడుతటస్థపడునోకదా.

విదూ—శకునములు, స్వప్నములు మహాదౌర్బల్యముగలవారిని బాధించవలసినవికదా.

పురు—నిశ్చయముగా నాకును చిఱుతపులివలెనే కనఁబడుచున్నది. ఇదిగో బాణమును వదలెదను.

(అని కొంతసేపూరకుండి)

గీ. వేఁట వేడుక బాణంబు ♦ వెడల మీఁట
నుండ వెనుకకు మది లాఁగు ♦ చుండెనయ్యా!
గాలి పైకెత్తుకొనఁగనున్న ♦ గాలిపడగ
లాగి బిగబట్టుసూత్రంబు ♦ లాగు సఖుఁడ!

విదూ—సంధించినబాణ ముపసంహరించుట యిక్ష్వాకువంశమువారి మర్యాద కాదుసుమా!

పురు—(కోపముతో) ఏమీ! ఇదిగో బాణమును వదలినాఁడను. (బాణమును విడుచుచున్నాఁడు)
(అంత తెరలో) హాహా! విశ్వామిత్రమహర్షి వారిపుణ్యాశ్రమమందలిదుప్పి నెవరో చంపిరికదా! ఈవార్త మహర్షి విన్నచో నెంతకోపపడునో!

(తిరుగఁ దెరలో)

గీ. ఎవఁడవుర! నీవు మృదువైన ♦ యీమృగమును
భైరవాశుగహతికి లోఁ ♦ బఱచినావు
కులుకుచును ముద్దు లొలికెడు ♦ చిలుకతలను
పెద్దగొడ్డలిపెట్టను ♦ బెట్టినట్లు.

పురు—
విదూ—
(నోటిపైఁ జేవైచుకొని భయముచే వడఁకుచున్నారు)

చిత్ర—ఇది విశ్వామిత్రునియాశ్రమము. ఆకంఠస్వరము విశ్వామిత్రునిదని తోఁచుచున్నది. అదిగో! ఆతఁ డిట్లేవచ్చుచున్నాఁడు.

గీ. కనుల నిప్పులురాల భీ ♦ కరపు కేక
లిడుచు ధుమధుమలాడుచు ♦ ముడుచు మోము
నెఱుపువారగ నదె వచ్చు ♦ లలిని మెఱుపు
గర్జతోఁ గూడుఘనఘనా ♦ ఘనముమాడ్కి.

అంశు—వర్షాకాలపుమేఘము సువృష్టినే గురియునుగదా.

చిత్ర—పిడుగునుగూడఁ బడవైచుట కలదు. ఇతడు సహజరాజసుఁడు.

గీ. జన్మరాజసు లచ్ఛ ప్ర ♦ శస్త్రసత్త్వ
మెన్ని తపములఁ జేసిన ♦ నెనయు నెటులు?
మధువనం దిరువదియొక్క ♦ మాఱు భావ
నలను జేసిన వేపగిం ♦ జలనుబోలి.



(తెఱలో)

గీ. గాధినందనుపృథుతపః ♦ కలితశక్తి
కన్ను గాననిమటమున ♦ నెన్న కేవఁడు
కుసుమసుకుమార మగుదీని ♦ పసయడంచె
నతఁ డధోలోకగతుఁ డగు ♦ నగునుగాత!

పుసు—శివశివా!
చిత్ర—హరిహరీ!
అంశు—హరహరా!
విదూ—కటకటా!
} అందఱు నొక్కసారి యనుచున్నారు.

పుసు—గీ. చిఱుతపులి యని దుప్పిని ♦ జెండినాఁడ
మునిమృగంబయ్యె నది; యేది ♦ భూమిఁ బ్రాత
బడినకొయ్యను జుట్టిన ♦ పామటంచు
భ్రమసి నిర్భాగ్యతనుకట్టి ♦ వైచితి నది
లింగమునఁ బ్రోబుపూలమా ♦ లికయ యయ్యె.

ఓ హా గాధినందన! క్షమించ లేకపోయితివికదా!

చిత్ర—ఆహా! మహారాజా! “ముని మృగమయ్యె” నని చెప్పినమాటలు యాదృచ్ఛికముగఁ బలుకఁబడిన వైననిట్టి మహాచక్రవర్తి యెడల నిర్దాక్షిణ్యమును గనఁబఱచినయీతనియెడల యథార్థములగుచున్న వినుమా!

(అంతట విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విశ్వా—గీ. సహజనిర్దోష మది ముని ♦ సంగతిని మ
చ్చింతనిర్దోష మద్దాని ♦ హంత! గూల్చి
తౌర! స్ఫటికము మఱి దేవ ♦ తార్చనంపు
పెట్టెలోనిది పగులంగఁ ♦ గొట్టినటులు.

ఛీ! నీమోముచూడరాదు. (అనివెనుకకుఁ బోవ యత్నించుచు న్నాఁడు.

పురు—(అంతలో పురుకుత్సుఁ డతనిపాదములమీఁదఁ బడుచున్నాఁడు.)
మహానుభావా! క్షమింపుము.

విశ్వా—లెమ్ము లెమ్ము.

విదూ—,,దానునితప్పు దండముతోసరి,, యన్నట్టు లోమునికులతిలకా! ఈచక్రవర్తిని క్షమించవలయును.

విశ్వా—(తనలో) ఓహో! పురుకుత్సుఁడా యితఁడు?

పురు—గీ. ఆశ్రమాజ్ఞత యొక్కటి ♦ యవల దుష్టి
పులిగ నెన్నుట మఱియొండు ♦ మునులు మిమ్ము
జూడ నజ్ఞతాదోషము ♦ లీడకున్నె?
బాలతరణిరాకను మంచు ♦ బాయునటులు.

విశ్వా—(తనలో) విశ్వామిత్రుఁడనైననాకునుచక్రవర్తియైనయీపురుకుత్సునకును సమానప్రమాదములే తటస్థించినవికదా.

గీ. మునులమృగమంచు నెఱుఁగక ♦ పులియటంచు
తీవ్రనారాచహతి వీఁడు ♦ ద్రెళ్ల నేసెఁ
జక్రవర్తిగ నెఱుఁగక ♦ జనుఁ డటంచుఁ
దీవ్రశాపాశుగమున నే ♦ త్రితిని యితని.

(ప్రకాశముగా) రాజా! భయపడకుము.

అంశు—శ్రీఘ్రకోపికి పశ్చాత్తాపప్రారబ్ధ మెన్నఁడు నున్నదే కదా.

పురు—ఓమహర్షి చంద్రమా!

గీ. చక్రవర్తిని మునులయా ♦ శ్రమములందుఁ
గీడుబొరయక యుండ ర ♦ క్షించుభార
మీతలనె యున్న దో మేర ♦ నెఱిఁగిమీఱఁ
గలనె? తపసొమ్ము తాను దొం ♦ గిలుట యెటులు?

అయినను, ఓమునిశార్దూలమా!

గీ. ఏను రాజను; మీరు మ ♦ హానుభావు
లరు; ప్రమాదము నాది; యీ ♦ వంతలోటు
మీకు; కొండంతశాపము ♦ నా కిడితిరి;
శక్రుఁ డొకవంక గిరిశిఖ ♦ సలుపుకరణి.

విదూ—మహర్షి చంద్రమా! మాంధాతయొక్కపుత్త్రు నితని కటాక్షింపుము.

విశ్వా—(తనలో) నాకు మిక్కిలిప్రేమాస్పదుఁడైనమాంధాతకు కొడుకనికూడ జ్ఞాపకము జేయుటచే మఱింతచింతగ నున్నది.

విదూ—(తనలో) లింగము మ్రింగినపూజారివలె నీముని మాట్లాడఁడేమి?

విశ్వా—భయపడకుము వత్సా! ఊఱడిల్లుము.

పురు—భయపడకు మని సెలవిచ్చితిరి గాన మనవిఁ జేసెదను.

గీ. నీదుకోపాగ్నిఁ గలిగిన ♦ నాదుకడుపు
చిచ్చు తిరిగి నీలోనికిఁ ♦ దెచ్చుకొనుము
ధాత్రిబాధించుమిత్త్రోత్థి ♦ తగ్రహాళి
తిరిగి మిత్త్రునిఁ జేరిన ♦ కరణి గాఁగ.

విశ్వా—నీవు వదలినబాణమును నీవు వెనుక కాకర్షింపలేనట్లు నేనును నాశాపమును మఱలింపలేను. కాన నధోలోకగతి స్వల్పకాలమైననుదప్పదు.

పురు—తప్పదా! మునికులసార్వభౌమా!

గీ. బ్రహ్మసృష్టించునిత్యోకు ♦ వంశజులకు
సురలలోకమె గతి యింత ♦ వఱకు నీవు
భళిర! తద్వ్యతిరేకపు ♦ బ్రహ్మవగుట
నాకధోలోకగతినిచ్చి ♦ నావుగాదె.

అంశు—సెబాసు! రాజా! బాగుగ నెత్తిపొడిచితివి.

చిత్రి—నెత్తిపొడిచిన బాగుగనే యుండును.

విదూ—మహర్షి శేఖరా! శాపమునకు గడువైనను సెలవిండు.

పురు—మిత్రమా! గడువుతో బనియేమి?

గీ. దుర్గమాశి కులజుండనగు నాక ♦ ధోగతి యొక
ఘటికగా నేమి వేయేండ్లు ♦ గాంగ నేమి
యతి వ్యభిచరించువాండైన ♦ నాతం డెంత
కాల మెందంటితో నను ♦ గడువు లేల?

విశ్వా—(తనలో) (పైపద్యముయొక్క కడపటి రెండుపాదములు తిరిగి చదివి) అనుసీతనిమాట లాతని శాణముకంటెను నాశాపముకంటెను దీక్ష్ణతరములై మేనకాసంగమమును నాకు జ్ఞాపకము చేయుచు మర్మములు నాటపొడుచుచున్నవి గదా.

అంశు—ఆహా! రాజేంద్రా! శాపమిచ్చినమునిసింహ మెదురుగ నుండగ గడువునుగుఱించి నీ వడుగకపోవుటయేగాక నీప్రియసఖుం డడిగిన నెంతనిర్లక్ష్యముగ గడు వవసరము లేదని చెప్పితివి!

చిత్ర—

గీ. సుగతి లేదని యెఱుంగుసీ ♦ సుస్థిరునకు
సాహసముగాక మఱి యేమి ♦ సఖుండ! మాన
మంతమును బొందుగౌరవ ♦ వంతున కిలం
బ్రాణమన్నం దృణప్రాయ ♦ మానుగాదె!

విశ్వా—(సాలోచనముగా) అధోలోకగతి స్వల్పకాలమైనఁ దప్పదు. తరువాత నూర్ధ్వలోకమునకుఁ బోయి యక్కడ నింద్రాదిదేవత ల దర్శించి తిరిగి భూలోకమునకు వచ్చి ప్రాణాధిక యగునీదేవి వలన సూర్యసమానుఁ డగుపుత్త్రునిఁ గాంచి సుఖింతువు.

విదూ—(తనలో) ఏమి యీద్రావిడ ప్రాణాయామము!

విశ్వా—గీ. నీ వధోగతి నొందుట ♦ నెమ్మి నింద్రుఁ
జూడ పైకేఁగుటకుఁ జాల ♦ సులువు నిచ్చు
వెనుకకును క్రొత్త పరువెత్తి ♦ వెడలునరుఁడు
పెద్దగంతును మునుముఁ ♦ బెట్టునట్లు.

విదూ—ఆహా! ఈశఁ డొత తెలివైనహేతువును జెప్పినాఁడు! ముందు గుజ్జుమెక్కు యోగము తటస్థపడుటకుగాను నీకా ళ్ళిప్పుడు విరుగఁగొట్టబడి వని చెప్పినట్లున్నది.

విశ్వా—రాజా! తపస్సునకై దిక్కె మేము పోవలెను.

పురు—(నమస్కరించి)

గీ. ఎవనిభుజపీఠి నీభువి ♦ యెక్కినదియొ
వాఁడె మీపాదములమీఁదఁ ♦ బడినవాఁడు
సుమ్ము త్రైలోక్యపాలన ♦ సుస్థిమింపు
నింద్రుఁ డలనురాచాఖ్యన ♦ కౌఁగినట్లు.

విశ్వా—నీకు భద్రమగుఁగాక (అని నిష్క్రమించుచున్నాఁడు.)

విదూ—మహారాజా! ఒక్కసందేహము గలిగినది ఒక్కభూలోకభారమే మీమీఁద నుండఁగా ముల్లోకముల భారముకలయింద్రుని తోఁ బోల్చుకొంటిరేమి! అధోలోకమునకుఁ బోవుభార మొకటియుఁ దరువాత నూర్ధ్వలోకమునకుఁ బోవుభార మొకటియుఁ గలియుటచేత నటు లంటి వని నే ననుకొంటిని. సాలెపురుగు పైకెగరఁబోయి కాలూఁత జారి గోడమీఁదనుంచి ఋల్లి క్రిందపడి

న్గొని నీ జీవనమృగమును జంపునాశచే నధోలోకమునకు పోలి గావలసివచ్చెనుగదా.

పురు—ఛీ! మిత్రమా! ఇక్ష్వాకుకులసంభవులకు సంధించినబాణ ముపసంహరించుట మర్యాదకాదని హృదయమునాట నీ వనుమాటచేత సందిగ్ధమనస్కుఁడ నయ్యును బాణమును వదలితిని. కాని నేను బుద్ధిపూర్వకముగా విడిచియుంటినా!

విదూ—చాలుచాలు! మహారాజా! తనయాపథములచే బ్రతికినఁ దనప్రయోజకత్వ మనియుఁ జచ్చిన రోగియొక్క నిర్భాగ్యత యనియుఁ బలుకువైద్యునివలె కార్య మనుసరించిన తనప్రయోజకత్వమును చెడిపోయిన నవ్వరులయప్రయోజకత్వ మనియు నహజముగ రాజు లీగతి యనుట నీతలనే పుట్టెనా! ఇట్టిచీవాట్లు దినుమని బ్రహ్మ నాతలనే వ్రాసెనా?

పురు—(విదూషకుని చేయిఁ బట్టుకొని) నీవు నాసఖుఁడవు కాని, సేవకుఁడవు కావుసుమా!

విదూ—ఆహాహా! (అని నవ్వుచున్నాఁడు)

పురు—(నవ్వుచు) అయినను కోపదీపితుఁడైనయామునిసింహు నిటు కాకర్షించుటకు నీవే ప్రథమకారణమవు.

ఆ. నీదుమాట వించు ♦ నేఁ జేయుపనిచేత
నాకు శాప మయ్యె ♦ నీకు లేదు
వఱదు గూసెనంచు ♦ వాపోవుకరి మృగ
నాథుబారిఁ బడును ♦ నక్క కేమి?

విదూ—ఆహా! మిత్రమా! నాకు మునివలన శాపము లేదని విచారించుచుంటివా! కొంపఁగాల్చుటకు కొఱకచ్చునిప్పైన నేమి, పిడకనిప్పైన నేమి. తిట్లు తినుటకు నీవలననైననేమి, మునివలననైన నేమి. నీవలన నిప్పుడే యాయవశిష్టముగూడఁ దీఱినదికదా.

అంశు—మిత్రమా! రాజుస్వభావమును బరిశీలించితివికదా!

ఆ. తాను శాపతప్తుఁ ♦ డైనను చిన్నిపూ
దేనెపలుకుగమిని ♦ దేర్చు సఖుని
శాంతవాని కమృత ♦ పూరాభరస మిచ్చు
గానుగందుఁ జెఱకు ♦ కల్పకరణి.

పురు—నీకు శాపము లేకపోయినదని నావిచారము కాదుసుమా!

ఆ. గొప్పకష్ట మెంతొ ♦ గొప్పవానికిఁగాని
బడుగులకును సంభ ♦ వంబు గాదు
పిడుగు గోపురమునఁ ♦ బడుగాని బాలల
పిచుకగూటబడునె ♦ పేర్మిసఖుఁడ!

అంతయె నాయభిప్రాయము. నీ వన్యథా తలఁచితివి.

అంశు—మిత్రమా! నా కొక్కయాలోచనతోఁచుచున్నది. ,,శంఖము నఁ బోసినఁగాని తీర్థము గా,,దనురీతిని నీచెవినిఁ బడినఁగాని యా ది పూజ్యమైనదిగాదుసుమా.

చిత్ర—ఏదియో చెప్పుము.

అంశు—ఏదనఁగా రాజేదో మాటలాడనున్నాడు. అదిముందువిం దము.

పురు—గీ. విమలమును బ్రభావంతంబు ♦ విగతదోష
మైననాచిత్తమందున ♦ మీనముగను
కలుషదుఃఖ మీపట్లను ♦ గలిగెఁగాదె
పద్మహితునకు రాహుసం ♦ స్పర్శమట్లు.

విదూ—పులుగుర్రాలినగృహమును శీఘ్రముగ విడిచిపెట్టవలసినరీతిని విశ్వామిత్రుఁడు వచ్చిపోయినయీతావును శీఘ్రముగ విడిచిపె ట్టఁదగును.

పురు—మిత్రమా! ఇంతకంటె నేమియాపద రాఁగలదు?

అంశు—మిత్రమా! నేచెప్పఁబోవున దేదనఁగా నిప్పుడే సురగలోకమున కీరాజును గొనిపోయి నర్మదోద్యానవనమందు చలువరాతిన్నెపై నితనిఁబరుండఁబెట్టెదను. నర్మదాపురుకుత్సు లన్యోన్యవీక్షణమున మోహావిష్టులై దంపతు లగుదురు గాక.

చిత్ర—తథాస్తు. అటులైన విశ్వామిత్రుని శాప మిప్పుడే ఫలింపనున్నది కాఁబోలును. మోహానసక్త నీవు నేప్పుడయొపలఁ బత్త్రభావమున నీరాజునకును విదూషకునకును నిద్రను గల్పించి రాజును మాత్రము తీసికొనిపొమ్ము.

విదూ—ఈశాపమం దెక్కుడుపటుత్వము కనఁబడదు. మిత్రమా! విశేషదుఃఖకారణమనియును దోఁచుట లేదు.

పురు—ఎందుచేత?

విదూ—అత్యంత సౌందర్యవతి యగుభార్యతోఁ జిరకాలము సుఖ మనుభవించి యాదిత్య తేజుఁ డగుకుమారునిఁ గాంచెద వని యామహర్షి పలికెనుగదా. ఇదివఱకు సుతుఁడు గలుగఁడయ్యె నను చింతచేఁ దపించుచున్న నీ కీశాపము వరమే యయినచో సంతసించుటకు బదులు సంతపించుచుంటి వేల?

పురు—ఓయి వెఱ్ఱివాఁడా!

గీ. నాకధోలోకగతి యుండ ♦ నారు లేల?
పుత్త్రు లేల? ధనం బేల? ♦ బొంది యేల?
నబ్ధిలోఁ బడి మునిఁగెడు ♦ నతని చుట్టు
కెంపు లేల? వజ్రములు మా ♦ క్తికము లేల?

విదూ—రాజా! విచారింపకుము! అదృష్టదేవత గయ్యాళిపెండ్లామువలె నొకప్పు డొకచెంప గట్టిగ ముద్దు పెట్టుకొనును. మఱియొకప్పుడు చెంప విరుగఁ గొట్టును. ముద్దునకుఁ జెంప నిచ్చి దెబ్బకుఁ జెంప నీయకుండఁగలమా! ఈయకపోయిన నెత్తినైనె,

గొట్టికె పూనదు. లెమ్ము రాజా పోవుదము. (అని రాజును లే
వదీయుచున్నాఁడు.)

చిత్ర—మోహనవిద్యను బ్రయోగించితివా?

అంశు—ఇదిగో ప్రయోగించితిని.

పురు—(కొంచెము దూరము నడచి) మిత్రమా! నాకుఁ గన్నులు తిరుగుచున్నవి. ఒక్క క్షణకాల మిచటఁ గూర్చుండెదను.

విదూ—మంచిది (అని యిద్దఱును గూర్చున్నారు.)

పురు—

గీ. దోసఁగఁదోఁచు ఱెప్పల ♦ తూలను మాటఁ
దల మిగుల బరువగు చుండ ♦ దనువు దూలె!
నడుకు లేనట్టియు త్సాలు ♦ మదినిఁ గ్రమ్మె
నిదుర వచ్చెడు నని తోఁచు ♦ నేస్తకాఁడ.

విదూ—సహవాసదోషముచేతఁ గాఁబోలును, నాకు నట్లేయున్నది.

పురు—అట్లయినఁ గొంతసేపు విశ్రమింతము.

విదూ—అవశ్యమట్లే. నీవు గుఱకపెట్టుదువు కాన దూరముగఁ బరుండుము. (అని యిద్దఱును నిద్దురపోవుచున్నారు.)

చిత్ర—(వారిని సమీపించి) ఉచ్చునఁబడినకొండముచ్చువలె నీబ్రాహ్మణుఁడెట్లుముడుచుకొని పరుండెనో చూడుము.

అంశు—ఓ రాజా! క్షమింపుము.

ఆ. హంసతూలతల్ప ♦ మందు నిద్రించు నీకు
మొరకునేల నిద్ర ♦ బుచ్చినాఁడఁ
బాలపాన్పుపైనఁ ♦ బూబోఁడితో నిన్నుఁ
జేర్చి వేగ లోటు ♦ దీర్చుకొందు.

మిత్రమా! ఇఁక రాజు నెత్తికొని యురగలోకమునకుఁ బోవ సె
లవిచ్చెదవా? (అని రాజు నెత్తికొనుచున్నాఁడు.)

చిత్ర—ఆ. భూభరంబుమోయు ♦ పురుకుత్సునీతని
నెక్కచేత నెత్తి ♦ యుంటి వీవు
భూమిమోయుశేషుఁ ♦ బోలుపారఁ గరకంక
ణముగఁ జేయుభూత ♦ నాథుకరణి.

ఇప్పుడు నీబాహుబంధమందుఁ జిక్కనయీమహారాజు నర్మదా
బాహుబంధమందు ముందు స్థిరముగఁ జిక్కుఁగాఁత.

ఆ. స్నేహబంధమునకు ♦ నేనిపు వేఱ్వేఱు
తుదల నైతి మీావు ♦ బొదలుబర్వ
తోడఁ గ్రింద కేగఁ ♦ దోడనేఁపైఁబోదు
నేచి నీరుఁదోడు ♦ నేతమువలె.

విప్రవర్యా! లెమ్ములెమ్ము (అనియిద్దఱును నిష్క్రమించుచు
న్నారు.)

విదూ—(లేచి)ఓహో! యెవ్వరో పిలుచుచున్న ట్లున్నవారు (కన్ను
లు నులుపుకొనుచు) రాజా! ఇంటికి పోవుదము లెమ్ము. (క
న్నులు తెరచి) ఏమీా! రాజు లేఁడయ్యెను! అయ్యో! యేమై
పోయెనోకదా! నేనే యిదివఱకు సజీవుఁడ నై యుండఁగ రాజు
న కేమిభయము కలిగియుండును? వేఁటతోఁగూడ వచ్చినభటు
లందఱును రాజును లేపి తీసికొనిపోయి యుందురు కాఁబో
లును. రాజు నను మఱచి యేగియుండవచ్చును. అయ్యో! ఈ
యరణ్యరోదన మెందులకు? ఇంటికిఁ బోయి సావకాశముగ నే
ఢ్చిన మంచిది. (అని నిష్క్రమించుచున్నాఁడు)

ప్రథమాంకముసంపూర్ణము.

---

శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.

## ద్వితీయాంకము.

రంగము—ఉరగలోకము నర్మదోద్యానవనము.

[నర్మదయును చేటిక నవమాలికయుఁ బ్రవేశించుచున్నారు.]

(ఒకమూల చలువరాతిన్నెపై పురుకుత్సుఁడు నిద్రించుచున్నాడు.)

(నర్మదయు నవమాలికయుఁ బూలచెట్లకు నీరుఁబోయుచున్నారు.)

నవ—నర్మదా! ఈపూలచెట్లు మిక్కిలి యదృష్టమును చేసికొనినవి సుమా!

నర్మ—ఎందుచేత?

నవ—మహారాజ పుత్త్రికనైన నీవలన సేవఁ గొనుటచేత.

నర్మ—పూలచెట్లు చక్రవర్తి చేతనైనను సేవఁగొనఁబడినవే కదా!

నవ—పుష్పవతి యగుకొమ్మను నీవుమాత్రము సేవ నొందులకపేక్షించ గూడదు!

నర్మ—నీవు సేవఁజేయుచు నుంటివేకదా!

నవ—నాసేవ కేమి లెమ్ము; నీకుఁ బతిచేయవలసిన సేవమాట జెప్పితిని.

నర్మ—(నవ్వుచు) స్వచ్ఛమై లావణ్యవంతమై యొంటరిదై యున్నయీ బొండుమల్లియపూవు నీకంటికి శోభగ నున్నదా? లేక ముం డ్లపొద పైఁ బ్రాకినయీచంపకలత శోభావంతముగ నున్నదా?

నర్మ—ఎట్లు!

నవ—కంటిని ప్రమాదవశముచే సులుముకొనిన వ్రేలితోఁ జెక్కు నంటుటచేతఁ గాఁబోలును! చెక్కుపై వ్రాసిన కాటుకచుక్కయు, చెమటచేఁ గాఁబోలును! కొంచెము జారి యిరుపాయలైనబొట్టును సంపెఁగప్రాలసుత్తురమెట్ట సుడుచుచేఁ బసపు రాచినట్లు కనఁబడుచున్న నిమ్మోముము, జాజిప్రాఁబ దట్లఁ గూరుటచే నాలత నీతలపై జల్లిన కుసుమములును గూడ నీమోమెంతయో మింతంతనరానికాంతిచేఁ బ్రకాశించుటయేకాక శీఘ్రముగ నీకు వివాహము గునని రూప సూచించుచున్నది.

నర్మ—(సవ్యాజము) ఓసి వెఱ్ఱిబాలా! అభిమానము వలన నిట్టివింతలు నీకు కనఁబడుచున్నవి.

నవ—సఖీ, నర్మదా! ఈవింత చూడుము చూడుము. ఐరావతముపై రత్నఖచితమగు సంబారి కట్టినట్లు లతలపై నేదియో కన్పట్టుచున్నది చూడుము.

నర్మ—నవమాలికా! అవునవును! అది యేమియో చూచి వేగ రమ్ము.

నవ—సఖీ! ఇద్దరమును పోవుదము.

నర్మ—నాకేడుమతోడ మిక్కిలి యదురుటచే నడువఁ గొంకుచున్నాను. నీవే పొమ్ము.

నవ—(అక్కడికి పోయి యాశ్చర్యముగఁ జూచుచున్నది.)

నర్మ—(తనలో) మహాసుందరపురుషుఁడును, అమూల్యమణిగణ ఖచిత భూషణుండును, మహారాజలక్షణలక్షితుండు నగు నొకమహానుభావుఁడు నిన్నరాత్రి నాకు స్వప్నమున సాక్షాత్కరించి వడఁకెడు నాకరమును దనకరమునఁ బట్టి "ఈమణికోటకేసుమా యీలోకమునకు వచ్చితి" నని చెప్ప తంబురతీఁగ నొకకొన

మీట ధ్వనియుఁ గంపమును తీఁగయంతయు వ్యాపించునటుల యొడలాపాదమస్తకము ఝల్లుఝల్లుమన నల్లనతన్నులు విచ్చితిని. శుభస్వప్న మైనవెంటనే రానియ్యఁగూడదనినిదుర తనయంతఁ దానె మాయ మాయెను. హృదయమా! అట్టిమహాపురుషు నెన్నఁడైనఁజూచి——

నవ——(సంభ్రమముతో వచ్చి) సఖీ! నర్మదా! నర్మదా! సఖీ!

నర్మ——ఏమీ! అంతసంభ్రమమునకుఁ గారణ మేమి!

నవ——ఎండదగిలిన మృగరాజము చలువకొఱకు చెట్టునీడనున్న పాలరాతిపలకపైఁ బరుండి నిదురబోవునట్లెవరో కిరీటాంగదభూషణుఁడగునొకమహాతేజశ్శాలి యాచంద్రకాంతశిలావేదికపైఁ బరుండి నిదురించుచున్నాఁడు.

నర్మ——చాలు !చాలు! సఖీ! నీమాటలను నేను నమ్మను.

నవ——సఖీ!పరిహాసముగ దు.యథార్థమే చెప్పుచుంటినిచూతువుగానిరమ్ము.

నర్మ——(తనలో) దీనివైఖరి చూడఁగ యథార్థము చెప్పుచున్నట్లు తోఁచుచున్నది. అసత్యవార్తనుగురించి సాక్ష్యమిచ్చెడునప్రామాణికుల పరస్పరాసందర్భవాక్యములవలెఁ గాక దీనినోట వెడలు మాటలను కనులసంభ్రమము, చెక్కులవిలక్షణకాంతియు సందర్భముగ స్థిరపఱుచుచున్నవి. కావున,

నవ——సఖీ! యెందులకీయాలోచన? పోయియుండినయెడల నీసరికిఁ జూచి తిరిగి వచ్చియుందుము.

నర్మ——అటులైన పోదము రమ్ము (ఇద్దఱును రాజునొద్దకుఁబోయి నిలువఁబడి యాశ్చర్యముతోఁజూడసాగిరి)

[అంశుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అంశు——ఆమహారాజుపైఁ బ్రవేశపెట్టినమోహనవిద్య నుపసంహరించుట మఱచియే వెళ్లితిని. ఈసరికి నర్మద యాతనిని చూచినదో

లేదోకదా! (అటునిటు పరిశీలించి) ఆహా మంచిసమయమునకు వచ్చితిని. తిరస్కరిణిచే నిచట ప్రచ్ఛన్నుడనై యీచిత్రమును జూచెదను.

గీ. పరమలావణ్యయుతగాత్ర ♦ వల్లియురగ
రాజపుత్త్రిక యీమహా ♦ రాజుదాపుఁ
జేరినది యల్లదేనూన ♦ హారభార
సారమాలతి సురపొన్నఁ ♦ జేరులీల.

నవ—సఖీ! నాపలుకులు బూటకము లంటివే.

నర్మ—(నవమాలికయొక్క నోరు మూసి) నిమ్మళముగమాటలాడుము (నిట్టూర్పువిడిచి) ఇప్పుడైనను నాకన్నులను నేను నమ్మలేకున్నదానను.

నవ—(నవ్వుచు) నీచేతితో స్పృశించిన యథార్థమని నమ్ముదు వేమో.

నర్మ—(తనలో) నిన్నను స్వప్నావస్థయందుఁ జూచినపురుషుఁడు వీని వలెనున్నాఁడు. ఇదినాకు తిరిగి స్వప్నావస్థయేమో! (ప్రకాశముగా) నవమాలికా! నేను నిదురబోవుచుంటినా! మేల్కాంచియే యుంటినా?

అంశు—ఆహా! మదనవికార మారంభమైనది.

నవ—"నిదురబోవుచుంటినా మేల్కాంచియుంటినా" అనినన్నడుగుచుంటివా! అడిగినవా రెవరో యదియైన నెఱుగుదువా!

నర్మ—(కోపముతో) ఏమి, అంతపరిహాసము.

నవ—నిదురబోవుచున్నరాజును జూచినమాత్రముననే వానితోనైక్యమగుటచేత నీవును వానివలెనే నిదురబోవుచున్నట్టు భ్రమసితివా!

నర్మ—నీవు నన్ను కలత పెట్టుచుంటివిసుమా.

నవ—ఈమహారాజు నిన్నుకలతపెట్టుచుండ నన్ననెద వేల?

నర్మ—(తనలో) హృదయమా! నిదురబోవువాని చూచినంత మాత్రమున నే నీవింత యుబ్బుచుంటివే, ఆమహాపురుషుఁడు మేల్కాంచి యాదరించువాఁ డైన నీ వెట్టులుందువో కదా! (ప్రకాశముగా) సఖి! మనలోకమందలి పురుషులకంటె భిన్నలావణ్యాదూపాతిశయములుకలయీపురుషుఁ డెవరై యుండవచ్చును?

నవ—నీచిత్తాబ్జమును వికసింపఁజేయ వచ్చినయాదిత్యుఁడు.

నర్మ—సఖి! అటులాక్షేపించుచుంటి వేమి? ఈపురుషునిజూచి నేను మోహపడితి నని నీవు దుర్భ్రమ పడుచున్నావుకదా!

నవ—(నవ్వుచు) ఆవిషయమై నాకనుమానము లేదు.

నర్మ—సఖి! ఈతని నిక్కడి కెవరు తీసికొని వచ్చినారో!

నవ—నీయదృష్టదేవత,

అంశు—గీ. నిన్ను నర్పింపదెచ్చితి ♦ నిన్న రేంద్రు
నిరువురును మీరు వెలయంగ ♦ నే సుఖింతు
తానొసఁగువిద్యచే ధన్యుఁ ♦ డైనశిష్య
వరునిఁ గని సంతసం బందు ♦ గురునికరణి.

నర్మ—(తనలో)రాజా! నాథాయనిపిలుచుభాగ్యము నాకెప్పుడగునోకదా (ప్రకాశముగ) సఖి! వీనిమోముచిన్నబోయిన ట్లున్నదిసుమా.

నవ—నిన్ను జూచువఱకు కాలాగున నే యుండును.

అంశు—ఆహా! శాపముచేఁ గలహృదయఖేదము నిదురబోవుచున్న వీని మోమునం దామె యెటులఁ గనిపెట్టెనో. ఆహా! మోహముయొక్కసామర్థ్య మింతం తనరాదుగదా.

ఆ. అతఁడుఃఖిన్నుఁ డయ్యె ♦ నం చట్టె గనిపెట్టె
వానిపైని రాగ ♦ వశతచేత
నొనర రాగమునకు ♦ నొడలెల్లఁ గన్నులే
వేయియంబకముల ♦ వేల్పులీల.

నర్మ—సఖీ! మోహమునందలియావిన్న బాటుగూడ నెంతో శృంగారముగ నున్న ది.

అంశు—ఇది స్వభావమే.



ఆ. విభునిలోటులైన ♦ వేయి శృంగారంబు
లగుట నిజము సుదతి ♦ యత్నులకును
బలక లొనరియున్నఁ ♦ బలుగాజుకణికతోఁ
జూచుబెడ్డ రత్న ♦ శోభ గనదె.

నవ—సఖీ! నీవు వీనిపాదసాన్నిధ్యమందుఁ గూర్చుండుము. గాఢముగ నిద్రబోవుచున్నాఁడు.

నర్మ—నీవుఁ గూర్చుండినచో నేనుగూడఁ గూర్చుండెదను.

నవ—[నవ్వుచు]ఆలాగా? సరే (అని యిద్దఱు వాని పాదములయొద్దఁ గూర్చుండిరి.)

నర్మ—[తనలో] ఈమహారాజుసరసను గూర్చుండి పరమానంద మిప్పు డొందుచుంటినికదా. అతఁడు మేల్కాంచినవెనుక నన్నంగీకరించునో తిరస్కరించునో?

నవ—సఖీ! నీ వేమి యాలోచించుచున్నావు?

నర్మ—నీవేమో వ్రాయుచున్న ట్లున్న దది యేమి?

నవ—మఱేమియు లేదు. నిన్నే వ్రాయుచుంటిని. నీవలన నేర్చినవిద్యయే కదా.

నర్మ—నన్నేల వ్రాయుచుంటివి?

నవ—విశేషమేమియు లేదు. సఖీ! నర్మదా! ఈమహారాజచంద్ర కాంతవేదికపైఁ బరుండ శేషశయనుఁ డగుశ్రీమహావిష్ణువువలెఁ బ్రకాశించుచున్నాఁడు. మన మిద్దఱము—

నర్మ—(కోపముతో) ఛీ! యేమనఁబోవుచుంటివి?

నవ—(అక్కడనుండి లేచి యావలకు వచ్చి) నేను భూదేవివలె నుంటి

ననినే ననిపోవుదు ననికదానీకింతయహంకారముకలిగినది. వరుఁ
డు నీకింకను లభ్యుఁడు కాకయుండెను; నేననఁదలఁచినమాట
నీవుపూర్ణముగ వినకయేపోయితివి. ఎందులకే నీ కింతయసూ
య! కానిమ్ము కైలాసగతుఁ డగుశంకరుని యర్ధాంగలక్ష్మి
యగుదుర్గామహాదేవివలె నీ వుంటివన్న నీకు సంతోషమేనా?

అంశు—శబాస్ నవమాలికా?

పర్శ్వ—(దిగుచు) ఛీ! సఖీ? న న్నెత్తిపొడుపుమాట లాడెదవా?

అంశు—

ఆ. అతివలందు బురుషు ♦ లందు హేతువు లేక
యే యసూయఁ జెంది ♦ యెప్పు డులుకు
నాఁడువారిచిత్త ♦ మలరారు గాలియే
లేక కదలురావి ♦ యాకుభంగి.

తడవైన దింక రాజుపైఁ బ్రవేశపెట్టినమోహనవిద్య నుపసంహ
రించెదను.

నవ—[రాజును సమీపించి తాను వ్రాసినచిత్రపటమును రాజుప్రక్క
ను పెట్టుచున్నది]

పర్శ్వ—నాపటము నారాజుప్రక్క నెందుల కుంచితివి?

నవ—నీరాజుకనుకనే యుంచితిని. ప్రక్క నెందుల కుంచితి నని యా
క్షేపించుచుంటివా? పోనిమ్ము. భావిపుంభావసూచనగాఁ బైన
నే పెట్టెదనులెమ్ము.

[అని నిమ్మళముగాఁ దీసి యతనివక్షముమీఁదఁ బెట్టుచున్నది.]

పర్శ్వ—ఛీ! ఏమిపని జేసితివి! [అనిరాజునొద్దకు పోయి యాపటము
నాతనివక్షమునుండి లాగుకొనఁబోవునెపమున నతని బాగుగ
స్పృశించుచున్నది. చిత్రఫలక మచ్చటనే పారవేయుచున్నది.]

[అంతలో రాజు మేల్కాంచుచున్నాఁడు.]

[అంతట నర్మదానవమాలికలు శీఘ్రముగఁ బరుగెత్తి పూలచెట్లవెనుక దాఁగిరి.]

నవ—ఎంతగడుసుదానవు. రాజును స్పృశించుటకుఁ జిత్రఫలకము దీసికొనువంక దొరకినదా?

నర్మ—(తర్జనితో బెదరించుచున్నది.)

పురు—[లేచి కన్నులు మూసికొని] ఓ హేలాగాధినందనా!

ఆ. వెనుక నిద్రలేచు ♦ వెంటనే "శివశివా",
యంచుఁ దలఁతు నిప్పు ♦ డందు "గాధి
నందన", యని చిత్త ♦ మందు ముందుగ నుండుఁ
బెట్టువానికంటెఁ ♦ దిట్టువాఁడె.

అంశు—ఆ. పరమభాగ్యకలిత ♦ పురుషుల కిలలోనఁ
దిట్టు దీవనగుట ♦ వట్టిమాట
కాదు చేతఁ బరశు ♦ వేది గల్గెడువాని
• కవని మట్టి బంగ ♦ రైనరీతి.

నీవు మహాదృష్టవంతుఁడవు రాజా!

పురు—(కన్నులువిచ్చి;)ఏమీ యిష్టసఖుఁడుగూడ లేఁడయ్యె నేమయ్యెనోకదా? (అటునిటు కలయఁ జూచి)-ఈస్థల మంతయునుక్రొత్తగనున్నదే! నే నిదిముం దెన్నఁడును జూచి యుండను. విశ్వామిత్రుని యాశ్రమమున మొదట నిద్రించితిని. ఇచ్చట మేల్కాంచితిని. ఇది యాయాశ్రమము గాదనుట స్పష్టము.

సీ. పెంపుడువక్షుల ♦ ప్రియవాక్యములె కాని,
కొంటెశిష్యులవేద ♦ ఘోష మిల్ల
లలితదోహదవాస ♦ నలు గుభుల్ కొను గాని,
హోమాగ్నిపరిమళ ♦ మేమి లేదు

పడఁతులు కొప్పున ♦ ముడుచుపువ్వులె గాని,
పూజ కుత్తమములౌ ♦ పూలు కొలఁది
రతియోగ్యతమకుటీ ♦ రములగములె గాని,
గూఢసమాధ్యర్హ ♦ గుహలు లేవు.

గీ. గాన మున్యాశ్రమం బిది ♦ కాదు నిజము
నవనవారంభయౌవన ♦ వివశలైన
స్త్రీలయుద్యానవన మిది ♦ తెలియఁ గాదె
పైఁటకొంగేదొ కాషాయ ♦ శాటి యేదొ!

నవ—మహానుభావా! బాగుగఁ గనిపెట్టితిరి.

నర్మ—సఖీ! ఆపురుషుఁ డింతసంభ్రమపడుచుండె నేమిచెప్పుమా! ఇప్పటివఱ కామమహానుభావునిచర్య యగ్రాహ్యమై యున్నది. (తనలో) హృదయమా! ధైర్యమ వలంబించుము.

పురు—ఇది యామహామునియాశ్రమమే కానియెడల నే నిప్పు డెక్కడ నుంటిని? ఆహా! యింకను నిదురబోవుచుంటి నేమో (కన్నులఁ దుడుచుకొని) ఏమీ ప్రత్యక్షముగా జాగ్రదవస్థలోనే యుంటి నిక దా.

గీ. కనులు గాంచెదుఁ, గర్ణముల్ ♦ వినెదు నిచటి
కలితపల్లవకలకంఠ ♦ కలరవముల,
మంచి దిదియుంచుఁ గాదంచు ♦ మనము నిశ్చ
యించు, నిదురంచు నే నెటు ♦ లెంచువాఁడ.

ఒకవేళ—

గీ. గాటమగుకలఁ గని మేలు ♦ గాంచునరుఁడు
స్వప్నవస్తువులనె చూచు ♦ సరణి నుండు
వనమునను బాముఁ గని యింటి ♦ నెనయుపిదికి
యేదిప్రాఁకిన పాముగా ♦ నెంచురీతి.

అట్టియవస్థలో నుంటినేమో—అదియే యైనయెడల శీఘ్రముగా నట్టిదుర్భ్రమ శివనామస్మరణచే నివారణ కావలసినదే కదా.

గీ. భూతగణనాథ! భూధర ♦ పుత్త్రికాస
నాథ! లాలితగణనాథ! ♦ బాధితరతి
నాథ! నాదైనయీస్వప్న ♦ బాధ బాపు
నాథ! లోకాధినాథ! య ♦ నాథనాథ.

(అని కన్నులు దెరచి యిటునటు జూచుచున్నాఁడు.)

అంశు—ఆహా! మహారాజా! నీకింతలోట్రుపాటును నేను కలుగఁజేసితినిగదా.

పురు—ఏమీ ఇంకను వెనుకటివలెనే యున్నదే! ఇదిస్వప్నవిషయమైన దుర్భ్రమ కాదు. మఱి యేమైయుండునో? ఇది భూలోకమే కాదేమో!

గీ. ఉష్ణ మధికముగా నుండె ♦ నురగపూత్కృ
తులరవంబులు మెండయ్యె ♦ గులకరాళ్ళు
గూడ మాణిక్యకాంతుల ♦ తోడ నెప్పు
భూమి యిది కాదు కాదను ♦ బుద్ధిపొడము.

అంశు—అవును చక్రవర్తి!

గీ. బూటకంబైనయూహలఁ ♦ బోఁగ విడిచి
తుదకు నిజమును గ్రహియించి ♦ పొదలి ఘోర
అడవిలో దారిదప్పుచు ♦ నరసి యరసి
మఱల నెట్టులో యిలు జేరు ♦ మనుజుకరణి.

నవ—ఈమహానుభావునిమాటలవలన నితఁడు భూలోకవాసియై యేకారణముననో యిచ్చటికి వచ్చినట్లు తెలియుచున్నది.

నర్మ—ఓమహాపురుషా! ఇది యురగలోక మని గ్రహించినట్లుగనె నిన్ను వరించుకాంతయిచ్చటనేయున్నదని కూడగ్రహింతువుగాక.

పురు—ఛీ! మూఢా! పురుకుత్సా! ఇదిభూలోకము గాదని భ్రమించు
చుంటి వేమిరా!

ఆ. నాదుబాహుపీఠి ♦ నేదయ లాలించు
భూమి నేను వేఱు ♦ బొంద నగునె?
నేను బ్రతికియుండ; ♦ నూనంబుఁ జెడకుండ
దానిపరిమళంబు ♦ దలగునెట్లు?

అంశు—ఓహో! మహారాజా!

ఆ. తప్పితప్పి తుదకు ♦ నెప్పు గాంచఁగఁబోయి
తిరిగి మోసపోయి ♦ తివి తరంగ
మొకటి వచ్చి తీర ♦ మొందింప వేచొంట
వనధిఁ ద్రోయఁబడిన ♦ మనుజాకర శి.

నవ—సఖీ! ఇతఁడు భూమినిఁబాలించుపురుకుత్సరాజేంద్రుఁ డని వింటి
మి. నీవదృష్టవంతురాలవు.

నర్మ—(తనలో) హృదయమా! శాంతి నొందుము.

పురు—అయ్యో! ఇది భూలోక మని తోఁచకున్నది ఇఁక మేటి యేమై
యుండునో కదా! నేను పురుకుత్సుఁడ నేకదా?

(తలపంకించి కిరీటమును జేతఁ బట్టుకొని)

ఆ. మహితతేజుఁడైన ♦ మాంధాత మాతండ్రి
బెట్టుదీని నేనె ♦ పెట్టఁ దగుదు
హరునిచేఁద్రిశూల ♦ మలకుమారస్వామి
పట్టుఁగాని యెవఁడు ♦ పట్టఁగలఁడు?

ఆహా! ఏమియుఁ దోఁచకున్నది చిత్తమా!

ఆ. కానియూహ లెన్నొ ♦ కావించి నిజమును
దెలియలేక సొమ్మ ♦ సిలితి వీవు
గదినిమూయఁబడిన ♦ కలకంఠ మిటునటు
నెగిరి యేచ్చి సీర ♦ సించుగతిని.

ఓహో! విశ్వామిత్రా! నీకధోగతియగునంటివిదేనా?

అంశు—సత్యము, సత్యము, ఇదే.

నర్మ—(తనలో) అయ్యో! విశ్వామిత్రునివలన నధోగతిపా లగు మని శాప మియ్యఁబడితివా! శాపమున్న సరే! మఱి యేదోషమున్న సరే! నిన్నే నేను వరింతును.

పురు—గీ. ఇంతకంటె నధోగతి ♦ యేది గల్గు
నేడనుంటినొ? యెవఁడనొ? ♦ యేదిస్థితియొ?
యెఱుఁగ కీరీతిఁ గేకల ♦ నిడుచునుంటి
సంధియెత్తినజ్వరితుని ♦ చందమునను.

ఆహా! పరమేశ్వరుఁడా! ఎట్టియవస్థ తటస్థింపఁజేసితివి! కానిమ్ము; పురుకుత్సుఁ డధైర్యపడువాఁడా! ఈధనువు చేతనుండఁ బురుకుత్సు నెదురాఁడువా రెవరు! (అని లేచుచున్నాఁడు.)

అంశు—ఓయి వెఱ్ఱిరాజా! నీధనువు నిన్ను గాచు ననుకొంటివా?

ఆ. తుంటవింటఁ దూఁపు ♦ నంటించి చలముతో
నిన్ను వ్రేయఁ గంతుఁ ♦ డున్నవాఁడు
ధనువు వదలి యదిగో ♦ తరళాక్షికన్బొమ
వింటిప్రాపుఁ గాంచి ♦ విజయి వగును.

పురు—ఎచ్చటికిఁబోదును! ఇచ్చటస్థితిగతులు తెలియుట కేమియు నాధారము లేదయ్యెను.

ఆ. నేను పలుకుమాట ♦ నేనె యాకర్ణింప
వలయుగాని వినెడు ♦ వాఁడు లేఁడు
తనప్రతిధ్వనులను ♦ తానె వించును గుహ
బొబ్బరించుసింహ ♦ పోతమట్లు.

నర్మ—(తనలో) వినెడువారే కాక విని నీయిష్టానుసారమే ప్రత్యుత్తర మిచ్చువారునుగూడ నిక్కడ నున్నారు. ఇటు రమ్ము.

పురు—(అటునిటు నడచి) ఏమిది? భూర్జపత్రమా! (సంభ్రమముతో దీసికొని)

గీ. మణులనైనను కాలితోఁ ♦ ద్రెనకువాఁడ
దీని సంభ్రమంబునఁ దీసి ♦ తిని విశేష
మలజడినిబొందు నాయుక్తి ♦ తెలియ నేట
మునుఁగువాఁడు తృణంబైనఁ ♦ గొనినకరణి.

(చిత్రఫలకమువంక దేరిపార చూచుచున్నాఁడు)

నవ—సఖీ! నీవిగ్రహమును భుజపత్రమందు చూచుచున్నాఁడు. ఇఁక నీవు గెలిచితివి.

నర్మ—సఖీ! నిజముగా నాచక్రవర్తి నాకు లభించకుండినయెడల నేను జీవించెదనా?

పురు—(పటమును జూచి మందహాసమును జేయుచున్నాఁడు.)

నవ—నర్మదా! నీరూపమును జూచి రాజు మందహాసము జేయుచున్నాఁడు.

నర్మ—అయ్యో! సౌందర్యవతిని కానని నవ్వుచున్నాఁ డేమో! నీవు యథార్థరూపమునే లిఖించితివా! లేక యసందర్భముల నేమైన వ్రాసితివా?

నవ—సఖీ! రా జేమో మాట లాడఁబోవు చున్నాఁడు.

నర్మ—అయ్యో, ఏమనునోకదా!

పురు—(పటమువంకఁ జూచి) ఆహా!

గీ. కన్ను లుండినఫల మది ♦ గాంచినాఁడ
నోరు నెవ్వంగ స్తుతి సేయ ♦ నోఁచినాఁడ
పులక లెత్తంగఁ గౌఁగిటఁ ♦ బొదువువాఁడ
ప్రతిమ! నాచింతఁ బాపఁగ ♦ వచ్చినావు.

నవ—సఖీ వింటివా! ఇఁక నీయవశిష్టమేకదా.

నర్మ—ప్రతిమకు నీవు నానైజసౌందర్యముకంటె నెక్కువ గలిగించ లేదుకదా.

నవ—ఎక్కువ గలిగించుట కవకాశ మేది?

పురు—ఓహో! ఈకాంత నా కెట్లు లభించునో! దీని నెనయకుండిన యెడల నే నెట్లు బ్రతుకువాఁడ.

గీ. పద్మపత్త్రాక్షి, వికసిత ♦ పద్మవదన
దీనిఁ గూడక నే నుంటి ♦ నేని నాదు
జీవనము నిందనీయమై ♦ పోవుఁ గాదె
పద్మలత లేనికొలనిజీ ♦ వనముభంగి.

నవ—గంభీరమైనగర్జలతోఁ గూడినమేఘమునుండి జారినస్వచ్ఛోదకబిందువులను వానకోయిల గ్రోలునట్లు వీని రసవంతంబు లగుగభీర వాక్యములను జెవులారఁ గ్రోలి నీచిత్తతాప మార్పుకొనుము.

నర్మ—నాకొఱకు కామహోరా జింత పరితాపపడుచున్నాఁ డని నేను వ్యసనము నొందు చుంటిని.

అంశు—రాజా! మునివాక్యఘాతము విశేషమా? కుసుమకోదండ నిర్ఘాతసాయక ఘాతము విశేషమా!

పురు—గీ. తిట్టె ముని యంచు గిజగిజ ♦ కొట్టుకొనఁగ
నట్టె పైఁబెట్టునను పూవు ♦ టమ్ము బెట్టి
కొట్టె సుమసాయకుఁడు దయ ♦ కట్టిపెట్టి
కలుగుకంటెని వ్రేలితోఁ ♦ గలఁచినట్లు.

ఆ. కాంతచింత నాకు ♦ గడువిశేషం బైన
కారణమున వెనుక ♦ గల్గుచింత
వేగ నడఁగిపోయెఁ ♦ బెద్దదీపము చిన్న
దీపమునకుఁ గ్రింద ♦ దాపినట్లు.

ఓహో! చిత్తమా!

ఆ. ప్రతిమఁ జూడ నిట్టు ♦ లతిసంభ్రమము బొందు
నీవు కాంతఁ జూడ ♦ నిలువఁగలవె?
కలను ధనపుప్రాతుఁ ♦ గాంచి పొంగెడు పేద
దృష్టనిధినిఁ బొందు ♦ రీతిగాఁగ.

ఏమైనను సరే. దానిని వెదకి చూచెదను [అటునిటు నడచి]

గీ. సుమములార! శ్రీచందన ♦ ద్రుమములార!
వల్లులార! సారంగీమ ♦ తల్లులార!
ప్రసవహాస, చందనగంధి, ♦ రమ్యగాత్ర
వల్లి, గజయానఁ, జూపుఁడీ ♦ పరమదయను.

ఓహో! ఈయరణ్యమును జూడ నత్యద్భుతరామణీయకఖని యైయున్నది. ఇంత యపూర్వలావణ్య మైనయుద్యానవనమును ము న్నెన్నఁడును కనియు వినియు నెఱుంగను. ఇది యథార్థమ యినవనము గాక మాయావన మని తోఁచెడిని.

గీ. మాయచేఁ బుట్టువస్తువు ♦ మహితశోభ
సత్యమావస్తువున కేల ♦ సంభవించుఁ?
జిత్తకల్పితసౌఖ్యవి ♦ శేషమహిమ
యిలను బ్రత్యక్షసుఖమున ♦ కేలయుండు?

ఆహా! ఆహా! ఆహాహా!

గీ. చుట్టు జాజిమొక్కలగమి ♦ శోభఁజెంద
నడుమసఖితోడ నయ్యదె ♦ వెలుగుచుండె
నెలఁత పరివేషయుతరోహి ♦ ణీసమీప
గతశరత్కాలవిధుకళా ♦ కలికవలెను.

గీ. వనితరూపంబు లావణ్య ♦ వైభవమును
గన్ను లున్నందు కిప్పుడే ♦ గాంచకుండఁ

బోఁటిని నాకన్నులును రెండు ♦ మూయసాగెఁ
జలివెలుఁగురాక చేబద్మ ♦ ములనుబోలె.

అయ్యో! నాప్రారబ్ధ మేమో! ఈనెలఁతకూడ మాయాకల్పిత యని తోఁచుచున్నది. అట్లే కానిచో నిట్టి సౌందర్య మలభ్య ముగదా! [నర్మదవంక కొంచెము సంకుచితాస్యుఁడై చూచు చున్నాఁడు]

నర్మ—అయ్యో! సఖీ! ఇఁక నాయాశ వ్యర్థ మయినది సుమా! రాజేమో కోపదృష్టినిఁ జూచుచున్నాఁడు.

పురు—ఇక్కడికి నే నెట్లువచ్చితినో తెలియకున్నది. ఇది యేలోకమో తెలియ కున్నది. నే నెవ్వఁడనో కూడ ననుమానింపవలసినట్లే యున్నది. ఈవనమెవరిదో యగమ్యగోచరమైయున్నది. ఆకాంత మతెవ్వరో యేమి తెలియఁగలను? ఆహా! ఇది యంతయు విశ్వామిత్రునిమాయ కదా! అయ్యో! గాధినందనునియింద్రజాల మ్మునఁ బడి చెడితినికదా! ఆహా! గాధినందనా!

గీ. చిఱుతపులినిఁ బెట్టి ♦ చేయి జారగనిచ్చి
దుష్టిఁ జేసి కొంప ♦ ద్రోచినావు
జనము మార్చి స్త్రీల ♦ నునిచి నోరును జార
నిచ్చి యేమి చేయ ♦ నెంచినావు!

అంశు—ఓయివెఱ్ఱిచక్రవర్తీ! ఈభ్రమ నిన్నింకను విడువకున్నదా! ఓహో! కామదేవా!

ఆ. ఇంక వెఱ్ఱిభ్రమల ♦ గొంకెడునీతని
పారి నీకొక్కగట్టి ♦ పోటుఁ బొడువుము
నుడువుచుండి తప్పు ♦ పొడిదెబ్బలకు లక్ష్య
పెట్టినట్టిశిష్యు ♦ మొట్టునట్లు.

నర్మ—అయ్యో సఖీ! ఇఁక నుపేక్షింప నాజీవనాపేక్ష నీకు లేదుసు మా! ఆమహారాజు నిచ్చటి కెట్లు తీసికొనివచ్చెదవో!

నవ—అవశ్య మిప్పుడే తోడ్కొని వత్తును. (అని రాజువద్దకు వచ్చి నిలిచినమస్కరింపుచున్నది.)

పురు—కళ్యాణమస్తు! ఎవరవునీవు?

నవ—నే నురగలోకమహారాజు పుత్త్రికయగునర్మదయొక్క సఖిని.

పురు—ఇదియురగలోకమా! ఈవనము మాయావనము కాదుగద! మీకాంత మాయాకాంత కాదా! నీవును మాయాస్వరూపమవు కావా!

నవ—ఇది యథార్థమయినయురగలోకము, మేము యథార్థమయినగాంతలము. మానర్మద యచ్చట నున్నది, కానఁ దా మచ్చటికి దయచేసి మాచెలికి మీదర్శనలాభమును గలిగించి యాకన్యారత్నముచే నెనఁగఁబడు—

పురు—(నవ్వుచు) కన్యకారత్నమేకద. అటులైన మాయాకన్యకయైనను, నీయాహ్వానమునకు సమ్మతించితిని.

ఆ. ఉర్వి మాయ యంచు ♦ నూరకుంటిమె నీదు
కాంత మాయయైన ♦ చింత లేదు
మాయలోనిమాయ ♦ మఱి సౌఖ్య మగునాట
కంబులోని నాట ♦ కంబుకరణి.

అంశు—ఆహా! ఏమి ఈమదనవేదాంతము.

నర్మ—(తనలో) ఓయదృష్టదేవతా! నన్ను శీఘ్రముగఁ గటాక్షింపుము.

పురు—మీచెలి యొద్ద కిదుగో వచ్చుచుంటిని. దారి చూపుము. ఓకాంతా నీపేరేమి.

నవ—అయ్యా! నన్ను నవమాలిక యనిపిలుతురు.

పురు—నవమాలికా! ఇఁక నా కీచిత్రఫలకముతోఁ బని యేమి!

ఆ. పడఁతిఁ జూడనపుడు ♦ పనికివచ్చెనుగాని
పడఁతిఁ జూడ దీని ♦ పని యిఁ కేల?
కత్తి కంఠసూత్ర ♦ కాలంబునసె కాని
కలయనున్న వేళఁ ♦ గత్తి యేల?

(అని చిత్రమును బారవైచుచున్నాఁడు)

అంశు—భళీ! రాజా! వివాహము కాకమునుపే గర్భాధానమును సూచించుచున్నావు!

నర్మ—చిత్తమా! ఉప్పొంగుచుంటివిగదా! (నవమాలికాపురుకుత్సులు నర్మదాసమీపమునకుఁ బోయిరి)

నవ—పొడుపుకొండపై చంద్రుఁడెక్కినట్లీ సీచంద్రకాంతశిలావేదికపై నోరాజా! తాముదయచేయుఁడు.

నర్మ—(తనలో) ఓసివెఱ్ఱిదానా! నాచిత్తమువలెనదియును గరఁగిపోవునుకాదటే!

పురు—(కూర్చుండి) నర్మదా! నీవుకూడ కూర్చుండుము.

(నర్మదానవమాలికలు నిలుచుండియున్నారు.)

పురు—నవమాలికా! మీసఖి క్షేమమేకదా

నవ—తమయనుగ్రహమువలన క్షేమమే-అయిన-

పురు—అయిన నేమి?

నవ—మరియేమియులేదు. తామేమో పరితాపపడుచుండి రనుచింతయామెకు గలిగియుండెను.

పురు—ఆపరితాపమైనను, మీసఖినిఁగూర్చియేకదా!

నర్మ—నేను మీకట్టివిచారమును గలిగించితి నని లజ్జపడుచున్నదానను.

పురు—నీవుస్వయముగా గలిగించినపరితాప మేమియు లేదు. నీచిత్రఫలకముఁ జూచి యత్యానంద మొందితిమి. నీయథార్థస్వరూపమును

జూచి పరవశులమే యయితిమి. ఇఁక నా కిదివరకుఁబరితాపముగ లుగజేసి నీకటాక్ష మున్నచో శిక్షాపాత్రుఁడు కానున్నవాఁడు.

నవ—ఎవఁడయా! వాఁడు!

పురు—మన్మథుఁడేకద.

నవ—నీవుపరితాపకారణమవు కావని యీమహారాజు పలుకుచున్నచో సింకను లజ్జయెందులకు? మో మెత్తి వారితో మాటలాడుము.

నర్మ—నాకు వంకలు దిద్దుమని నీతో నెవరును జెప్పియుండ లేదు.

పురు—నర్మదా! ముఖము వంచినయెడల ముఖచంద్రకాంతిచేఁ గుచచక్రవాకములు పరితపించునుసుమా!

నర్మ—సఖీ! ఇరుఁ డెదుట వెల్గుచుండనట్టిలోపము తటస్థింపదని నీవు చెప్పరాదా. (అని మోమెత్తి కన్నులార జూచుచున్నది)

పురు—ఆకారణముననేకదా నీనేత్రపద్మము లిప్పుడు సంపూర్ణముగ వికసించినవి.

నవ—నర్మదా! నీవు నిలుచుండుటచేత మహారాజునకు బాధగ నున్నది సుమా.

పురు—బాధలేదు సరేగదామీఁదిమిక్కిలి యానందకరముగ నున్నది.

నవ—(తనలో) ఎందుచేతనో యిటు లనుచున్నాఁడు!

పురు—నావంటివాని నీకాంత పతిగ నంగీకరించు నని యాశనాకు లేకపోయినను, అంగీకరించితి నని చెప్పువిధముగ సతి పతియెదుట నిలువబడిన ట్లీమెనాయెదుట నిలువబడుటయే నాకుపరమసంతోషముగనున్నది.

నర్మ—(కూర్చుండి, తనలో)ఈయసాతంత్ర్యమును నాకుమనోహరముగనే యున్నది.

పురు—నవమాలికా! ఒకరియెదుట నొకరు గూర్చుండ నామెయు నేను నెట్లుంటిమో చెప్పఁగలవా?

నవ—వేఱే చెప్పనేల? పెండ్లికొడుకు, పెండ్లికూఁతురువలె నున్నారు. నేనుమాత్రము నడుమ తెరవలెనింకకొంచెమడ్డుగ నున్నదానను.

నర్మ—మహారాజా! మీవృత్తాంతము కొంచెమింతకుముందే యిచ్చట వినియుంటిమి. మీ కాకోపిష్ఠమునియొక్క శాపముగలిగెనని విచారించితిని.

పురు—శాపమువర మేయయినదట్టివి మాహాత్మ్యమువల్లనేకదా దుర్లభమయినయురగలోకమును జ్యోతి నతఁడే నన్నిక్కడకుఁ దీసికొనివచ్చినాఁ డని తోఁచు చున్నది. ఆతనివరమాహాత్మ్యమువల్లనేక. దాయిట్టియపూర్వదర్శనలాభముగలిగినది.అంతమట్టునకేయామునియొక్క వరమాహాత్మ్యమటుపైన నీకటాక్షమాహాత్మ్యమును, నాభాగ్య రేఖయే కదా!

నర్మ—ఒకలోకమువారు మీరు, వేఱొకలోకమువారము మేము; మీకును మాకును సఖ్యము సరిపడనిదేకదా.

పురు—అటు లనుచుంటి వేల?

గీ. తరణియెక్కడ యెక్కడ ♦ ధరణి; ధరణి
యేడ శశి యేడ; యాకర్ష ♦ ణేద్ధశక్తి
నొకరిచుట్టును దిరుగుదు ♦ రొకరువిడువ
రెప్పుడట్టిచో సహవాస ♦ మెట్లు లోదవె?

(నర్మద కోపరక్తనేత్ర యగుచున్నది.)

గీ. కొమ్మ నర్మద కేమొకో ♦ కోపరక్తి
గండఫలకములందునఁ ♦ గానుపించెఁ
బండుతమలపాకులను బై ♦ నుండునెఱ్ఱ
యవిసిపువ్వులు ప్రతిఫల ♦ మైనయట్లు.

నవ—కోపకారణ మేమో మీరెఱుఁగనిది కాదు. ఆసంగతి నేను చెప్పినయెడల బాగుగ నుండు నని మీ రడిగితిరి గాన చెప్పెదను.

ధరణీమిత్రులకును కువలయకువలయహితులకువలెనే ఇచ్చటను దూరసంగమమునుమాత్రమే సూచించితి రని—

నర్మ—ఛీ! అనవసరపుమాట లాడెద వేల? అవతలికి పొమ్ము.

నవ—(నవ్వుచు) చేత పండు చిక్కిన పిమ్మట నాకింకేమి నవసర మేమి? (అని నిష్క్రమించుచున్నది)

(నర్మద నవమాలికవెంటఁ బోవ ప్రయత్నింపఁగాఁ బురుకుత్సుఁ డడ్డగించుచున్నాఁడు)

పురు—పలుపలుకు లేల? నేను నిన్ను సంపూర్ణముగ వలచితిని. భూలోకరాజన్యు లందఱును నాపాదసేవఁ జేయుచుండ నేను నీపాదసేవఁ జేయుచు భూలోకమున నీతోనుండఁగలమహాభాగ్యము నీవు నాకు లభింపఁజేయనియెడల—

నర్మ—మీరు మహారాజులు స్త్రీలోలురు. ఆక్షేపించితి ననితలఁపకుఁడు. ఇదివఱకుమీకెందఱుభార్యలో నేనడిగిన నన్నుమన్నింతురుగాక.

పురు—ఇది వఱకొక్కభార్యయే కలదు. సుమతి యనునది.

నర్మ—ఆమె మీకు నర్ధాంగిలక్ష్మిగదా,

అంశు—ఆహా! భూలోకకన్యకల కుండుసౌభాగ్యములలో సగభాగమైన నీ యురగలోకకన్యకల కుండదుగదా!

పురు—గీ. ఆమె యర్ధాంగలక్ష్మిగనే ♦ యైన నిన్ను
పెండ్లి! నానెత్తిమీఁదను ♦ బెట్టుకొందు
నర్ధనారీశ్వరుఁడనైన ♦ యతఁడు వరుస
దయను దలమీఁద గంగను ♦ దాల్చుకతన.

నర్మ—యథార్థమేనా!

పురు—ఉరగకాంతకు సతె పెక్కునాలుకలుండునా?

నర్మ—మీరు దానికి ప్రతిగనే యుంటిరే! [illegible] నాకేల [illegible]

పురు—(చేతినిఁ బట్టుకొని) ఇదియే పాణిగ్రహణముసుమా.

(నర్మదను కౌఁగిలించుకొనుచున్నాఁడు)

అంశు—ఆహా వారిసౌభాగ్యము.

సీ. మంజుకాంతుల దేదీప్య ♦ మానుఁడతఁడు
కుసుమకోమలి దీనితోఁ ♦ గూడి కనుల
పండువయియుండువరమహా ♦ భవ్యలక్ష్మి
యలవసంతునిఁ గూడుచు ♦ నలరినట్లు.

పురు—దేవీ! అదిగో చూడుము. పై నల్లుకొనినజాజిపూలతలు రాల్చిన కుసుమములచే వేయనిపానుపు గలిగి నమీపస్థమణులయొక్క, కాంతిచేఁ బెట్టనిదీపములు గలిగి ప్రకాశించుచున్నయీపూఁబొదరిల్లు మిక్కిలి శోభగ నున్నదిసుమా!

నర్మ—(గడ్డము పట్టుకొని) తొందరపడకుము. తండ్రిచాటుదానను. అతఁడు నాకు వివాహము శీఘ్రమునఁ జేయఁదలఁచి యున్నాఁడు. నీవును నేనును రేపు కలిసి యాతనిని దర్శించి అక్కడ సుముహూర్తంబున వివాహ మాడుదము.

అంశు—నర్మదా! బుద్ధిమంతురాలవు

పురు—ఓహో! నర్మదా! నేను నీమాట కెదురాడఁగలనా! అయినను ఈనాయుంగరమును నీవు ధరించి నీయుంగరమును నాకిమ్ము. (ఉంగరములు మార్చుకొని) అహా! మణి మణినిఁ జేరుటచే నా యుంగరము నీచేతిని మఱింతశోభగా నున్నది.

అంశు—వీరిద్దఱు పరస్పరమోహావిష్టు లైరి. ఇఁక నేను సంతసించితిని. ఈతని నిప్పుడే భూలోకమునకు తీసుకొనిపోక యిచ్చటనే యుంచినయెడల మహారాజుగా రెట్లనుమానింతురో. ఏమి యసాధ్య మగునో. ఇతఁడా! మహారాజు; ఈమె మహారాజపుత్త్రిక. వీరిద్దఱిని మహారాజుగారి సెలవు లేనిదే శాశ్వతముగఁ గూర్చుట

తప్పుపని. వీరికి నొకరియెడ నొకరి కనురాగ మెట్లుండునో కని పెట్టుటకు మాత్రమే వీరిని తీసుకొని వచ్చితిని. వీరిని శాశ్వతముగ సంధానపఱుచువాఁడా కామదేవుఁడే, అదియునుగాక.

ఆ. కష్టసాధ్యమైన ♦ కాంతమైఁ గలిగెను
శాశ్వతదయ సులభ ♦ సాధ్య గనునె?
రాతిమీఁది వ్రాఁత ♦ రహి నిల్చునట్లుగా
నిసుకమీఁది వ్రాఁత ♦ యెట్లునిల్చు.

కావున సులభసాధ్యయయిన, యీనర్మదనుండి ఈరాజేంద్రుని ప్పుడే వేఱుచేసినఁ గానివీరిదాంపత్యసౌఖ్యము మరణాంతము నిలిచియుండదు. రాజా!

ఆ. ఇపుడు కష్టమైన ♦ నెంతో సౌఖ్యము మూఁదు
నీవుగాంచఁగలవు ♦ నిశ్చయముగ
ప్రథమమందుఁ గుట్టు ♦ బాధ నొందినఁగాని
కుండలములు చెవులఁ ♦ గూర్పఁబడునె?

గీ. మురియుచును ముద్దులొలుకుచు ♦ మొనయువీరి.
బొదలు మోహనవిద్యచే ♦ బొదువువాఁడ
పోరి గుబాళించి కుల్కుపా ♦ వురవుకోటి
మీఁద వేవేగ వల్వేయు ♦ మృగయుమాడ్కి.

ఇదిగో మోహనవిద్యను బ్రయోగించితిని.

నర్మ—నాథా! నాకు నిద్ర వచ్చుచున్నది.

పురు—దేవీ! అభ్యంతర మేమి? నాతొడమైఁ తల నిడుకొని పరుండుము. (నర్మదయట్లు చేయుచున్నది.) ఆహా ఏమిది నాకుకూడ నిదురవచ్చుచున్నది. నిలుప శక్యముగాకుండ నున్నది. ఇట్టినిద్దరయే భూలోకమున నుండగ నావహించినది. ఇప్పుడేమిమూఁడునో కదా! ఓనర్మదా!

గీ. మబ్బుగ్రమ్మిన నేత్రప ♦ ద్మములతోడ
నెట్టులో యొక్కసారి వీ ♦ క్షింతు నిన్ను
పట్లు తప్పుచున్న నా ♦ బాహువులను
కాంత యొకసారి యెట్టులో ♦ కౌఁగిలింతు.
(అని నర్మదపై నిద్దుర బోవుచున్నాఁడు.)

అంశు—(వారిద్దఱిని సమీపించి) ఇఁక తిరస్కరిణితో పనియేమి.

గీ. మెడను మెడఁ జుట్టి పరవశ ♦ పడినచక్ర
వాకములభంగి బలుపెన ♦ వైచుకొన్న
సర్పములభంగి నితఁడును ♦ సర్పకాంత
కౌఁగిళులఁ గూడి నిద్దురఁ ♦ గాంచువారు.

అయినచు రాజును వేఱుచేసి భూలోకమునకుఁ దీసికొనపోకఁ తప్పదు.

గీ. కాంత నీకిట్లు జూపితిఁ ♦ గాంత నీకుఁ
దగు ననుచుఁ దోఁచె నిఁక శాశ్వ ♦ తముగఁ గూర్ప
నెంచెదను బంగరునఁ బ్రమా ♦ ణించిచూచి
పిదప మణియుంగరము జేయు ♦ విధముగాఁగ.

రాజు నెత్తుకొని నర్మదా! లెమ్ము. లెమ్ము. (అని పైకినిష్క్రమించుచున్నాఁడు.)

నర్మ—(లేచి) నాతల నుంచుటచేత నీతోడ నొచ్చినదేమో కొంచె మొత్తుదునా? ఏమిది! రాజు లేఁడయ్యెను! ఆహా! ఏమిమోస మయ్యెనో కదా. ఓమహాచక్రవర్తీ! పురుకుత్సా! ఎటుబోయితివి. ఈయుద్యానవనమందలివిచిత్రములను జూడఁబోయితివా. ఓనాధా! నన్ను విడిచియెక్కడికేగితివి? సులభముగ లభించితి వని మిగుల నుప్పొంగితినే. నెత్తిమీఁదఁ బెట్టుకొందు నంటివే. పాతాళమునకు నడఁగఁద్రొక్కి పోయెదవా! రేపు వివాహ మాడుద

మీదినమునకు శాంతించుమన్నఁ గోపము వచ్చినదా! ఓదైవమా! నా కీపాపపునిద్దుర నేల యీసమయమునకే తెచ్చితివి. అయ్యో! కన్నులు తెరచియున్నను కన్ను లగపడుట లేదు. నాథా! నిన్ను జూచినకన్నులు వేఱువస్తువులను జూడవు. ప్రాణేశ్వరా! రమ్ము. నానేత్రపర్వమును జేయుము. నామోహా వెట్టిదియో కనిపెట్ట నిట్లు చేసితివా? ముమ్మాటికి నిన్నే నమ్మినదానను. అరుంధతి పూజ్యుఁడయినవసిష్టమహర్షిని త్రికరణశుద్ధిగఁ బ్రేమించినరీతిని ఓచక్రవర్తీ! నేను నిన్నే ప్రేమించితిని. ప్రేమించినవారి విడనాడ న్యాయమా? సమస్తధర్మశీలుఁడవు. నీకునన్ను విడనాడ నెట్లు మన సొప్పెను! వెన్నెట్టుకఁ గా ల్లెట్లాడెను. ఇదిగో నీముద్రిటుంగర మింక నావ్రేలినే యున్నది. నీయంగదములకొనలు దగిలి నాబాహువు లివిగో గీచికొనిపోయెను. నీచిహ్నములు నాయం దుండ నీవుమాత్రము పోయెదవా! ఉరగకాంతవుగనుక నీకు రెండునాలుక లని యాక్షేపించితివి. నాథా! నీ కొక్కనాలుకయే గదా! మహారణ్యమందుఁ తనతోడపయి శయనించిన పరమసాధ్వి యైనదమయంతిని నలచక్రవర్తి విడనాడి పోయినట్లు చేసితివా! నవమాలికా! నవమాలికా! (నవమాలిక ప్రవేశించుచున్నది.)

నర్మ—నానాథుండు నాతండ్రిగారినిఁ జూడ మందిరమునకు వచ్చినాడా?

నవ—ఏమీ! ఇచట లేఁడా?

నర్మ—అయ్యో నాయాశ లన్నియు నిరాశ లయినవి. మహారాజెక్కడకో పోయినాఁడు కానబడఁడు.

నవ—దేవి! ఊఱడిల్లుము.

నర్మ—ఊఱడించుకొనఁదగిన విచారము కాదు. స్థితిచేత మనకంటెఁ బైలోకమువాఁడు. మహాచక్రవర్తి. ఇదియును గాకనాచేత కో

రుకొనఁబడినవాఁడు. పరమసులభుఁడు. అట్టివానిఁ బాసి నే నుం
డఁగలనా!

నవ—ఆతఁడు విశ్వామిత్రునిమాయచే నిచ్చటకు వచ్చినాఁడు. తిరిగి
యాతనిమాయచే భూలోకమునకుఁ బోయియుండును. ఆతఁడు
భూలోకచక్రవర్తి యనియు, పురుకుత్సుఁ డనియు, మన మెఱుఁ
గుదుముగద. అతనినిఁగూడ చూచినవారముగద.

నర్మ—అతనియుంగరముగూడ నా వ్రేలినేయున్నది.

నవ—ఇఁక నేమి! కామగమనముచే భూలోకమునకుఁ బోయి యాత
నినిజూతము. ఆతఁడు బుద్ధిపూర్వకముగా నిన్ను వదలి భూలో
మునకుఁ బోవువాఁడు కాఁడు. నిన్ను విడుచుటచేత నాతఁ డెం
తపరితాపపడుచుండునో! ఏమియు జడుపకుము కంట తడిపెట్ట
కుము. ఈయెడబాటు మఱింత సౌఖ్యమునకే కలిగిన దని భా
వింపుము.

నర్మ—(నవమాలికకాళ్ళపైఁ బడి) వెనుక యామహాచక్రవర్తిని సంఘు
టనచేసినది సంఘటనకాదు! ఇఁకముం దెట్లు నన్నీదుఃఖాబ్ధినుం
చి తరింపఁజేయుదువో.

నవ—నీ వేమియు సంకోచింపకుము. ఈమందమారుతము, ఈచిలుకలు,
కోయిలలు మొదలగునవి నీ విచ్చట నున్న మఱింత బాధించు
నుగాన శీఘ్రము బోవుదము రమ్ము.

నర్మ—భూలోకమున కెప్పుడు పోవుదము?

నవ—శీఘ్రముగ నే పోవుదము రమ్ము.

ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.

ద్వితీయాంకము సమాప్తము.

---

శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.



## తృతీయాంకము.



రంగము—భూలోకము.

పురుకుత్సుని రాజమందిరసమీపోద్యాన వనము.

[విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—నిద్రయు, మోహమును, ఒక్కతల్లికిఁ బుట్టినకవలపిశాచములు. తలకుమ్మరిసారెవలె తిరుగునట్లుచేసి, కన్నులున్న పెంకులవలె దృష్టిరాహిత్యముకలవానిగఁ జేసి, చెవులను నిరతుంకుట్లులవలె శబ్దగ్రహణశూన్యముగఁ జేసి, యిదమిత్థమని నిశ్చయించఁగలబుద్ధిని మదుదుమీఁదనుండి పిల్లినివలెఁ గ్రిందికిఁ బడ గొట్టి, అసందర్భంబును నహేతుబద్ధంబును అలౌకికంబు నగుచికిబికి యూహలచే సాలెపట్టునందీఁగవలె మనస్సును గిజగిజ కొట్టుకొనఁగఁజేసి, మతి దేశాంతరముపోయినవానివలె కారణములేని నవ్వుల నవ్వఁజేసి, నిర్భాగ్యురాలగుభార్యవలెఁ జీటికిమాటికి నేడువఁజేసి, యొకప్పుడు మూతిని కుక్కమూతి యొడుజల్లెడుకాయవలెముడుగునట్లుచేసి, యొకప్పుడు బ్రహ్మకాయవలెవటవట వదరునట్లు చేసి, గాలివలె కామగమనమును కలుగ జేసి, మీఁదిమిక్కిలి దేహస్మృతియే లేకుండ జేసి, మనుజులను వేధించుటయందు నీనిద్రామోహములకు సమాన మయ్యు నసమా

నశక్తియే కదా! ఒక్కపిశాచ మావహించినవానికే యింతయు పస్మార మగు నని చెప్పునెడల మసూచిలో విసూచిరీతి నొక పిశాచములో రెండవపిశాచ మావహించినవారిస్థితిచెప్పుట యసాధ్యముకదా. అటులే మారాజుగారికినిద్రాపిశాచమందుమోహపిశాచముగూడ నావహించినది. ఉరగలోకమున కేమోపోయినాఁడఁట! అక్కడ నొక్కదివ్యమంగళవిగ్రహమును గాంచినాఁడఁట! దాని నేమో కౌఁగిలించినాఁడఁట! తెల్లవారకమునుపే భూలోకంబున నున్నాఁడఁట! ఆహా! ఏమి సందర్భముగనున్నది! నేనే యిట్టియసందర్భవాక్యముల నాడినచోఁ దలపై కత్తివాట్లను పెట్టుదురుగదా. అసందర్భప్రలాప మదృష్టవంతుని ప్రాపుఁ జేరుటచే శిక్షార్హము గాకుండుటయే కాక నొకప్పుడు పూజ్యముగూడ నగును. రాజువిచారగ్రస్తుఁడుగ నున్నమాట నిజము. నీరుల్లి దరుగువారికన్నులవలెఁ గన్నులు కలిగి, కుళ్ళుమామిడిపండువలెఁ గొంచెము దించుకొనిపోయినచెక్కులుగలిగి, కొలిమితిత్తులవలె నిశ్వాసంబు గలిగి, మరకట్టులమీఁదివానివలె నొకచోటనైనఁ గాలు నిలువక, శ్రమపడుచున్నమాట నిజమే. కాని, తత్కారణమైనయురగలోకగమనముమాత్రము మిథ్య. అదుగో! రాజు దొడ్డిసంభావనకుఁ బరువెత్తు బ్రాహ్మణునివలె నిల్లింతశీఘ్రముగ వచ్చుచున్నాఁడో?

పురు—(ప్రవేశించుచున్నాఁడు.)

సీ. కలువుల నీనెడు ♦ కళుకుకాటుకసోగ,
కన్నులుగలకల ♦ కంఠకంఠి
ముద్దులొల్కెడుచెక్కు ♦ లద్దాలఁగొంచెము,
కోలవాటగుమోము ♦ గ్రాలుదాని
శ్రీకారములఁబోలు ♦ చెవులను రతనాల,
గ్రాలెడుజూకాలు ♦ వ్రేలునబల

పొడుగనియనిపించు ♦ పూవంటినును మేన,
దగుపాటిపుష్టిచేఁ ♦ దనరుకాంత,
గీ. అందుఁ బదునాలుగేండ్లప్రా ♦ యంపుయువతి
మారుచేతి కటారి యొ ♦ య్యారి దాని
బాసి మరుబారి నెగగూరి ♦ పలవరింతు
నారి నేజేరి సుఖియించు ♦ దారి యేదొ?

విదూ—(రాజునుసమీపించి) స్వప్నావస్థయందుఁ గాంచినచంచలాక్షి కొఱ కింతవిచారించ నగునా?

పుర—చాలు! ఎన్నిమాఱులు చెప్పినను నీకు నమ్మకము లేదుకదా?

విదూ—జ్ఞానసంపూర్ణుఁడ నగుటచే నా కట్టినమ్మకము లేదు. స్వప్నములు కొన్నికొన్నిప్రకృతులం దత్యద్భుతవికారములు కలుగఁజేయును. స్వప్నములలో లేచి చదువుకొనువారును, గ్రామాంతరములకుబోవువారును, నదుల నీదువారును గూడఁ గలరు. ఒకనాఁటిపగలు నేను నిదుర బోవుచుండ పనసతొనలు తినినట్లు కలఁగని నిదుర మేల్కాంచినతర్వాత మూఁడుగడియలవఱకు కడుపునొప్పిచేత బాధ పడితిని. దుస్స్వప్నములయొక్క యత్యద్భుతమాహాత్మ్యమజీర్ణబాధపడునాకుఁ దెలియఁదగినదే కానినీకేమి తెలియును?

పుర—నీ విప్పు డేమైన స్వప్నావస్థయం దుండి పలవరించుచుంటివా?

విదూ—పచ్చకామెరలు గలకన్నునకుఁ బ్రపంచ మంతయుఁ బెండ్లికూతురుమొగముగనే యుండునుగదా!

పుర—ఇదిగో యిట్లుచూడుము.

గీ. వెలఁదియుంగరమును నాదు ♦ వ్రేలఁ బెట్టి
రమణివ్రేలిని నాయుంగ ♦ రంబు నిడితిఁ

ప్రేమచేఁ గాంతుఁ డొకముద్దు ♦ వెలఁది కియ్య
నింతి యొకముద్దు కాంతున ♦ కిచ్చురీతి.

ఈమణియుంగరమైన నీసంశయాంధకారము బాపఁగలదా?

విదూ—ఏది! మణియుంగరమునుజూడనిమ్ము.

పురు—ఇదుగో (అని చూపించుచున్నాఁడు.)

విదూ—ఆహాహా! నక్త్రగుల్ల మొగమువలె నిగనిగలాడుచున్నది. ఇది యెద్దుకన్నులాగున మిక్కిలి యెఱ్ఱగ నున్నది. నీలము కాదుగద.

పురు—(నవ్వుచు) ఆహా! రత్నశాస్త్రపాండిత్యము! దీనియందలి మాణిక్యమును బరిశీలించుమని నీకుఁ గనఁబఱుపలేదు. ఈయుంగరమునుజూచియైన నీదుర్భ్రమ పోగొట్టుకొందు వని—

విదూ—నిప్పుఁజూడ వెలుగుబంటి పారిపోవకుండునా! అల్లే

పురు—మణిస్పర్శచేవిషవ్యాప్తి మాయమగుటయాశ్చర్యమా?

విదూ—కడుపునిండినవాని కాఁకలిగొలుపుపిండివంటయొక్క పరిమళమెంతవిశేషమో కదా. అటువలెనే మహాసుందరుఁడ వైననిన్ను వలపింపజేసినకాంత యెంతసౌందర్యవతియో కదా! సామాన్యసుందరులకు నామెకును మామూలుభోజనమునకు విందునకును గలిగినభేదముండుట కవకాశమున్న దేమి?

పురు—వయస్యా! భోజనప్రియా! నాకు రత్నాకరునివలె మహామణుల కేమియు లోటులేదు గదా.

విదూ—(నవ్వుచు) విద్వచ్ఛిఖామణి వైననామాట చెప్ప వేమి?

పురు—

గీ. మన్మణులయందు ప్రథమమౌ ♦ మణియుఁగూడ
దీనియెదురను దేజోవి ♦ హీన మయ్యెఁ
జుక్కగమిలోన నెక్కుడౌ ♦ రిక్కఱేఁడు
పద్మహితురాక వెలవెల ♦ బారుకరణి.

గీ. ఈమణికి నామణికి భేద ♦ మెంత కలదో
యింతులకుఁ గూడ నట్లె యా ♦ యింతి మొదటఁ
దన్నెలఁతలందు దానిరూ ♦ పెన్న నేల?
మిన్ను చేనంటునరుపాడ ♦ వెన్నఁదరమె?
ఓయురగలోకవాస్తవ్యా!

(అంతట నంశుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

గీ. నెలఁత నిన్నాయువంతచే ♦ జిలజిలయని
శశినమణికూడ నీరును ♦ గ్రమ్ముచుండ
నునుకనులు నావి నీరొల్క ♦ జనదె యినుమె
కరఁగ నగ్గివేడిమి, వెన్న ♦ గతి యిఁకేమి?

అంశు—ఆహా! నాచెలికాఁడగుచిత్రకేతుఁడిచట నాతోఁ గలసికొని యెద నని చెప్పి యింకను రాకున్నవాఁడు. ఓహ్హో!

గీ. సఖుఁడు తనుజూడఁ గాంతను ♦ జారవిడిచి
పల్లటిల్లెడునీరాజు ♦ పరిఘవిల్లు
గ్రుష్లుమిడకరించుక తన్ను ♦ గూబ చూడ
కాంతఁ గాసినచక్రవా ♦ కంబురీతి.

పురు—మిత్రమా! దీర్ఘాలోచనము జేయువానివలెమాటలాడకుంటివేమి?

విదూ—అవశుఁడ నయ్యెను, యథార్థమును గనిపెట్టితివి. సృష్టిసం బంధమయినయొకరహస్యము నాలోచించుచుంటిని. సముద్ర మునకుక్షారోదకము కలుగుటకుఁ గారణమునుగురించి.

పురు—ఎట్లాలోచించితివి!

విదూ—ఎట్లనఁగా మోహావశ లయినస్త్రీలుస్త్రీలకౌఁగిటకుఁ బరస్పర ము నేడ్చుటచేత,

పురు—సృష్టిరహస్యములో మదనరహస్యము వేఱొకటియా? స్త్రీలు స్త్రీలకౌఁగిటి కేడ్చుట యేమి?

విదూ—కంటఁదడిపెట్టనుండుటయేకదా పౌరుషలక్షణములలో నగ్రగణ్యమైనది.

పురు—గీ. నాదుకంటికి దీపంబు ♦ నాదుమదికి
నూంత యొడలికి గంధంపు ♦ పూంత నోటి
కమృత మగుదానిఁ బాయు ధై ♦ ర్యంబు వూదె!
పాపతో దృష్టిపౌ నసం ♦ బద్ధ మగునె?

వయస్యా! ఆకాంతారత్నమును నీవు చూచియుండక పోవుట చేతను, మన్మథనారాచతీక్ష్ణత్వము నెఱుంగక పోవుటచేతను, నీవట్లనుచుంటివి.

విదూ—ఆహా! మదనసాయకవ్రణవ్యథ నే నెఱుంగ ననుచుంటివా? పూర్వమొకసారి నే నొకపిల్లిని వలచి ధైర్యమును గోలుపోయి—

పురు—ఛీ! తిర్యగ్జంతువునుగూడఁ వలచితివా?

విదూ—కీటకమును వలచుటకంటె గౌరవహానియుఁ బ్రాణహానియుఁ గాదుగదా.

పురు—నానర్మద కేవలసర్పరూపమున నున్నదని భ్రమించుచుంటివా?

గీ. పాముఱూపంబు వేసినే ♦ పరగు నాశ్ర
యమును పెనవైచుతత్స్వభా ♦ వము మదీయ
గాఢపరిరంభణమునందె ♦ కానిపించు
మానినులకెల్ల నది తల ♦ మానికంబు.

గీ. నేను గూర్చుండ నాతోడ ♦ పైని శిరముఁ
బెట్టి తెగబారెఁడగుజడ ♦ వెనుక గ్రాల
నుంతవంకగ శయనించెఁ ♦ గంతుఁ డలసి
తనతోడను జేర్చె మనసజ్య ♦ ధనువుభంగి.

గీ. ఉండవలసినయావస్తు ♦ వుండకున్న
సత్వమణి హస్తికనకరా ♦ జ్యాదు లేల?
భక్తి నిలుచనియోగికి ♦ వందగోము
ఖములు, గంపెడుజడ లున్నఁ ♦ గార్య మేమి?

విదూ—నీకాంతను నీవు జేరునుపాయ మిప్పు డాలోచించితిని. అటు లుచేసినయెడల నిశ్చయముగ నీవు సఫలుఁడ వగుదువు. నేనుజె ప్పినట్లు చేసెదవా?

పురు—గీ. వేసవిని మండుసుప్పాట ♦ విని హసించి
మండుచున్నది చిత్తంబు ♦ మదనబాణ
వహ్ని చేఁదాపమార్పంగ ♦ వలయుఁ జుమ్మి
వెలయనామార్గమేదియో ♦ వేగ చెప్పి.

నేను జెప్పినట్లు చేసెదవాయని యేలయడిగెదవు. ఏమైనను సరే చేయుటకు సిద్ధముగ నున్నాను.

గీ. బ్రదికియుంటకు ఫలమైన ♦ పడతిఁ బాసి
వనట జెందెడునే నింతి ♦ నెనయుదారి
కలుగగంజేయ కేటులుందు ♦ గరళమైన
రోగి త్రాగడె తిరిగి యా ♦ రోగ్యమునకు.

అంశు—ఓ రాజా!

గీ. క్రూరరతికాంతసంతప్త! ♦ గ్రుచ్చుమాట
లాడునీతని ప్రాపేల ♦ యందితయ్య!
దిమ్మదిరుగఁగ మిడిమొండ ♦ బొమ్మజెముడు.
కంచెనీడకుఁ జేరుసిం ♦ గంబుకరణి.

విదూ—ఈవిమిపమందే వేటకుఁబోవలయుచు—విశ్వామిత్రుని యర ణ్యమునకే పోవలయుచు—ఈసారి దుష్పినిజాపిన శాప మీ యఁడు కావున జావకుండ నామునినే కొట్టినయెడల సద్యోలోక

గతి శాశ్వతముగ నగు నని శాప మిచ్చును—అంత నీకాంతను నీవు నిరంతరముగ ననుభవింతువు—రాజేంద్రా! నీవధోలోకమునకు బోయితివని చెప్పితివికదా. రాజకార్యమును మఱచి కేవలరాగపరవశులై కాలముబుచ్చువారి నెవరినైన నాలోకమున నాలోకించితివా?

పురు—ఏమి!. నన్నే చూచితిని.

విదూ—అయ్యో! ఏలినవా రుండఁదగినంతయధోలోకమే లేదుగదా

పురు—ఎందుచేత.

విదూ—భూలోకమునందుండి కేవలకాంతాపరాయణులైనవారికొఱకీ యధోలోకము బ్రహ్మచే సృష్టింపఁబడినది. ఆయధోలోకమునకుఁబోయి యచ్చట కాంతాలోలురైనవా రుండురను ముందు దృష్టిలేక వారికి దగినలోకమును సృజింపక పోవుటచే బ్రహ్మయజ్ఞుఁడు నపూజ్యుఁ డయ్యెను జుమా.

పురు—మరుని బాణములవాఁడికంటెను నీమాటలవాఁడియెక్కువగ నున్నది.

విదూ—అటులైన మిత్రమా! దారినిబడితివి.

పురు—ఎట్లు?

విదూ—రాజా! తనగౌరవమును రక్షించుకొనఁదలచినవాఁడు కాంతలవలలో నెప్పుడుపడఁడు. మోహము, గౌరవలతకు వేరుపురుగు సుమా! కాంతనువలపించి దానిని గడ్డముపట్టుకొని బ్రతిమాలింపఁజేసి యంగీకరించనియెడలఁ గాళ్లపైఁ బడునట్లుచేసి, మహారాజునైనను బికారినిజేసి, యతిశౌర్యవంతునైనను జెవులపిల్లివలె బెదరువానిఁగఁజేసి, మగడుకొట్టిన బొంకులాడివలె నేడ్చువానిఁగఁజేసి, గౌరవమును హరింపఁజేయుటలో మోహమునకుఁ గలసామర్థ్యమవర్ణ్యముగదా. అట్టిచో నారిపోవుపత్తి నెగసన్న

ద్రోచినటులుమర్మభేదకర మగుమాటలచే మానుషమును ప్రజ్వలింపఁజేసినయెడల దానివిరోధి యగుమోహము శీఘ్రము బలహీన మగునుగదా. రాజా! ముల్లు నూడఁదీయ నూది కావలయునని యెఱుఁగవా?

పురు—చెవ్వులార్చుకొనిపోయి కొంచెము హోరు గలిగి శ్రవణశక్తి తగ్గుచున్నది. నీవు విశేషించి మాటలాడిన ప్రయోజన మేమియు లేదు. ఓయురగలోకవాసినీ! ఓనర్మదా! నాకనులకు దృష్టిశక్తిగూడమందము గాకమునుపే యొక్కసారి యిటు వచ్చి నన్ను గౌఁగిలించుకొనుము. (అప్పుడు నర్మదయు నవమాలికయు ప్రవేశించుచున్నారు.)

నర్మ—నిన్ను నే నెఱుఁగ నని రాజు నన్ను తిరస్కరించు నేమో?

నవ—అసంతుష్టురాలా! ఊరకుండుము. (అటునిటుఁజూచి) నర్మదా! నీ వెంతయదృష్టవంతురాలవే! అదుగో! రాజు. అచ్చట విరహభారవశుఁడై ప్రియసఖునితోడ నేమో చెప్పుకొనఁ బోవుచున్నాఁడు.

నర్మ—మన మిచ్చట కొంత సేపు దాఁగియుండి వా రేమనుకొనియెదరో వినినపిమ్మట వారినిఁ జేరిన మంచి దని నే నూహించెదను.

అంశు—ఆహా! నర్మదా! వచ్చితివా! ఎంతసాహసముగలదానవు!

[తల పంకించి]

గీ. పిల్లి బావురుమన నుల్కు ♦ వెలదులైన
మోహ మావేశమైనఁనం ♦ బుధులు దాఁటు
గలరు లోకముల్ గానిలో ♦ కముల్నైనఁ
బడయుదురు గాలివడి గాలి ♦ పడగఁబోలె.

ఓచిత్రకేతుఁడా! పురుకుత్సునే చూచితివి కాని నర్మదనుఁజూచి యుండవుకదా. అహో! ఇంతయపూర్వదర్శనముకూడ నీకుశీఘ్రముగఁ గలుఁగుఁగాక.

(అంతట చిత్రకేతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చిత్ర—ఓహో! రాజుగారిచ్చటనే యిష్టసఖునితో వేంచేసి యున్నారు.

అంశు—పూజ్యుఁడైనచిత్రకేతుఁడా! నమస్కారము. మంచిసమయమునకు వచ్చితివి. అదుగో! మహారాజు విరహభారవశుఁడై విచారించుచున్నాఁడు. వెనుక నుండుజలయంత్రమున కానుకొని సఖీసమేతమై నర్మద ప్రకాశించుచున్నది. తిరస్కరిణిచేఁ బ్రచ్ఛన్నుఁడవు కమ్ము.

చిత్ర—అట్లే. మిత్రమా! నమస్కారము. ఆలస్యముగ వచ్చినందులకు క్షమింపుము.

పురు—ఆ. చేటిదెప్పులకును ♦ జెక్కు లెఱ్ఱన జేసి
నన్ను జూచి చిన్న ♦ నవ్వునవ్వ
దానిమోము గ్రాలు ♦ తరళితచంద్రికా
ప్రతిఫలమున తామ్ర ♦ పర్ణివోలె.



నర్మ—ఆ మహాదృష్టవంతురా లెవరో కదా!

నవ—నీవే! నిన్ను దెప్పినదానను నేనే.

చిత్ర—అంశుమంతుఁడా! వీఱిద్దఱిని బాగుగ సంఘటించుటయందునీవు తుంటవిల్లులేనిమన్మథుఁడ వైతివికదా. ఆహా! నర్మదయొక్క సౌందర్య మత్యాశ్చర్యకరముగ నున్నది. ఇంద్రలోకమున నైన నిట్టిసౌందర్యవతు లొకరిద్ద ఱుందురేమో. ఈదినమున నింద్రుని యాజ్ఞచే నొకచిత్రము జరుగవలసి యున్నది.

అంశు—మిత్రమా! నేను వినదగినదేనా?

చిత్ర—వినఁదగుదువు. చూడఁదగుదువు. అందుకు నాకు సాహాయ్యముకూడఁ జేయఁదగుదువు.

పురు—వయస్యా! మాట లాడవేమి?

విదూ—నీకు చెవులు కొంచెము వినఁబడకుండుట యేలా గున్నది?

పురు—ఆలాగుననే యున్నది. మీఁదిమిక్కిలి యొడలంతయు మండుచు న్నది. ఓ హెూ నర్మదా!

(నర్మద తొట్రుపాటుతో ముందునకుఁబోవుచున్నది.)

నవ—(నర్మదచేయి బట్టుకొని) నిన్నుఁబిలుచుచుండుట లేదు.

పురు—౹౹ఆ. పడఁతిఁ జూడనప్పు ‡ పనికివచ్చెను గాని
పడఁతిఁ జూడ దీని ‡ పని యిఁకేల,, అని,

ఓనర్మదాచిత్రఫలకమా! నేను మూఢుఁడనై నిన్నురగలోకమునఁ బారవైచితిని. నీ విచ్చటనున్న నాకుఁ గొంతతాపశాంతి కలుగునుగదా.

నర్మ—నీతో శాశ్వతముగ సుఖించుటకు నేనె వచ్చియుండ నాచిత్రఫలక మేల?

విదూ—విచార మేల! చిత్రఫలక మేను వ్రాయఁగలను.

పురు—నీ వాకాంతను జూడకుండ నెట్లు వ్రాయఁగలవు?

విదూ—వ్రాయుట చిత్రమేకదా!

పురు—చిత్రమే.

విదూ—కావున చిత్రమే వ్రాసెదను. మన్మథుఁడా గ్రుడ్డివాఁడు. వానిచేఁ బీడింపబడినకాముకుఁడా, గ్రుడ్డివాఁడే. ఇఁక చిత్రఫలకము ను వ్రాయువాఁడు చూడకున్న వాఁడైననేమి? చేతికివచ్చినదే దో వ్రాసెదను. అదే నీకాంత యని శాంతి నొందినచాలదా? సుఖదుఃఖములు మనస్సునందలివి కాని బాహ్యవస్తువులందలివి కావుగదా.

అంశు—ఇంద్రునియాజ్ఞచే జరగవలసినరహస్య మేదియో చెప్పుము.

చిత్ర—నిన్న నీవును నేనును సమావేశమైనయపుడు జరిగినసంగతు లన్నియు పురందరునితో విన్నవించితిని. అతఁడు మిక్కిలి సంత

సించి మాంధాత తనకుఁ బుత్త్రిసమానుఁ డనియును, పురుకు త్సుఁడుమాంధాతకొడు కగుటచే నాతఁడు తనకు మనుమఁ డగుననియును, తనకు మనుమరాలు కాఁబోవునర్మదను తాను చూడకయే వారివివాహమున కంగీకరింప ననియును, నాగలోకమునకుఁ బోయినర్మదను తనలోకమునకుఁ దీసికొనిరావలసినదని సెలవిచ్చిరి.

అంశు—ఆహా! నర్మద యిప్పుడు కదా పరమపూజ్యురా లైనది.

గీ. మొదట రాజేంద్రుపుత్త్రిక ♦ పిదపఁ జక్ర
వర్తి యిల్లాలు త్రైలోక్య ♦ పాలనాథ్యుఁ
డైనవజ్రికి మనుమరా ♦ లగునుగూడ
దానిభాగ్యంబు వర్ణింపఁ ♦ దరముగాదు.

చిత్ర—ఆకారణమున నాగలోకమున కేగి యచట నర్మదం గాన కిచటికి వచ్చితిని. అందుకొఱ కింతయాలస్య మైనది. రాజునకును నర్మదకును సమావేశ మైనవెంటనే నర్మద నింద్రలోకమునకుఁ గొనిపోయెదను.

నర్మ—రాజదర్శనము రిక్తహస్తములతోఁ జేయవలసివచ్చెను. రెండు నిమ్మపండ్లైనను లేవయ్యెనుగదా.

నవ—లుబ్ధురాలా! ఉండియు లేనట్లు విచారించు చుంటివే!

అంశు—రాజు మిక్కిలి చింతాక్రాంతుఁడై యున్నాఁడు. మిత్రమా! చూడుము.

గీ. కన్ను లరమూసి చెక్కిటఁ ♦ గరము గ్రాల
శిరము నొకవైపునకుఁ జేర్చి ♦ చిటుచిటుకు
మంచు కన్నీళులొలికెడు ♦ నతఁడు గ్రాలు
వెలయు దైన్యంబు మూర్తిభ ♦ వించినట్లు.

నర్మ—ఆలస్యమేల? నాకాంతుని దరిజేరుటకు నేను మిక్కిలి సంభ్రమిం
చుచుంటిని. అతఁడు నాకొఱకు సంతాపపడుచుండ నేనుపేక్ష
సేయుచుంటిని.

నవ—ఇదిగో యిప్పుడేపోవుదము. రాజేదోమాటలాడఁ బోవుచున్నాఁడు.

పురు—సీ. దడదడమంచు నా ♦ యెడలు తూలఁదొడంగె,
చేపట్టి యూఁపవే ♦ చిగురుఁబోఁడి.
కనుదమ్ములకు నంధ ♦ కారంబు గల్గె నీ,
తనుదీప్తిచే దాని ♦ దరుమఁగదవె?
నాభిదగ్గరనుంచి ♦ నాలుకవఱకు కారె,
తరుణి! నీయధరామృ ♦ తంబు నిమ్ము!
భగభగయంచు తా ♦ పము గ్రమ్మె చల్లని,
యొడలితో కౌఁగిలి ♦ యొసఁగఁగదవె

గీ. మెడను తల నిల్వకున్న ది ♦ య్యెడను నాదు
చెవులు గడియలుబడియెను ♦ చెంతఁ జేర
రమ్ము నర్మద! నర్మద! ♦ రమ్మురమ్ము!
నర్మదా! శోషమొందు ప్రా ♦ ణములు నాకు.
నర్మదా! (అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

నర్మ—నాథా, నాథా, ఇదిగో వచ్చితిని (అని కౌఁగిలించుచున్నది.)
అయ్యో, ప్రాణవల్లభుని కెటులుండునో కదా.

విదూ—(ఆశ్చర్యపడుచు) అయ్యో! రాజుమూర్ఛాగతుఁడయ్యెను! ఆ
హా! ఎంతయిక్కట్టు తటస్థించెను? ఈమె నర్మదయే కాఁబోలు.

అంశు—గీ. చేత నెత్తితి నిరుమాఱు ♦ ప్రీతి నితని
నన్య; నైనను మది దుఃఖ ♦ మధిక మయ్యె
కనియు నెత్తి పెంచెడువారు ♦ గాంతురేని
సుతునిమూర్ఛల నేరీతిఁ ♦ జూడఁగలరొ?

నర్మ—నవమాలికా! నేనుగౌఁగిలించియేయుందును. నీవు విసరుము. లెమ్ము. (ఆలోచించి) అయినను నీవెందులకు! నేనే విసరుకొ నెదను.

చిత్ర—ఆ. రాజు మూర్ఛబడుచు ♦ రమణిబాహుల శాంతి
గొంచు నుండఁ జెలియఁ ♦ గొంచుఁబోదు
నంబుదంబు పర్వ ♦ తాగ్రామశాంతికై
వ్రాల గాడ్పు మబ్బుఁ ♦ బాపుకరణి.

ఛీ. దాంపత్యభంగకృత్యముగదా!



అంశు—వయస్యా! ఏమి ఆలోచించుచున్నావు!

చిత్ర—ఆ. వజ్రియాజ్ఞదీర్ప ♦ వచ్చును పాపంబు
దీర్పకున్న గొంతు ♦ దెగుట నిజము.
ముందు, వెనుక, గూడ ♦ పోవుచున్నది మది
రెండుతలలపాము ♦ రీతిగాఁగ.

అంశు—గీ. దంపతులు వీరు సుఖియించు ♦ దారి యట్టి
వజ్రికంటెను జెలియంగ ♦ వశమె నీకు?
మావులను మల్లె లొలయించు ♦ మాధవుండు
తోఁటగాచెడు కాపరి ♦ పాటిగాఁడె!

నర్మ—నవమాలిక! ఇంకను నాకాంతుఁడు లేవకున్నాఁడు.

చిత్ర—(రాజును కొంచెము సమీపించి)

గీ. లో నడంగిననెత్తురు ♦ సోన యచటి
వెలఁది నర్మదయో కాదో ♦ తెలియ నేమొ
తొంగిచూచెను చెక్కుల ♦ తుదల చంద్రుఁ
గాంచు తెలినీటిపై యెఱ్ఱ ♦ కలువమాడ్కి.

విదూ—ఇప్పుడు రాజునకు కొంచెము స్వస్థత కలిగిన దని తోఁచుచు న్నది.

నర్మ—సఖీ! రాజు కదలుచున్నాఁడు.

విదూ—రాజా! లెమ్ము.

పురు—(లేచి కన్నులు మూసికొని) ఓహోనర్మదా!

గీ. ఉసురునామోము చల్లగ ♦ నొత్తి యుర ము
రమ్ముజేరిచి విపులసౌ ♦ ఖ్యమ్మునిచ్చి
కౌఁగిలించితి వని కల ♦ గాంచినాఁడ
గద యభాగ్యునకుఁగలల ♦ గలిమి కాదె?

విదూ—రాజా! మహాభాగ్యవంతుఁడవు. ప్రత్యక్షమైననర్మదనే చూతువు. కనులు విప్పుము.

పురు—(కన్నులు తెరచి) ఆహా! నర్మదా! ఆహాహా!
(అని తొందరగఁ గౌఁగిలించు కొనుచున్నాఁడు.)

నర్మ—నాథా! నీ కిప్పుడు దేహమందు సుఖముగ నున్నదా!

పురు—గీ. నాసుఖంబున కేమిలే ♦ నాతి నీవు
సత్య మగునర్మదవొ లేక ♦ స్వప్నదృష్ట
నర్మదవొ ముందు చెప్పుము ♦ నాకు శిరము
నిలిచినమైన సర్వంబు ♦ నిలుచుఁగాదె?

నర్మ—యథార్థముగ నేను నర్మదనే. ఇదిగో నీమణియుంగరమును చూడుము. (అనియుంగరమును చూపించుచున్నది.)

పురు—(చూచుచు) ఆనందపారవశ్యమున కన్నులు మూసికొనిపోవుచున్నవికదా.

చిత్ర—వయస్యా, తిరస్కరిణి నుపసంహరించి యప్రచ్ఛన్నరూపముతో నీమెను పైకి దీసికొనిపోదును. నీమోహనవిద్యా ప్రభావము నెక్కటెప్పపాటులో నాసమయమందు కనుపఱచవలెను. వయస్యా. ఈమె నాకు సహోదరి సుమా! నాకు సెలవిమ్ము.
(అని వెనుకనుండి వచ్చి గుబాలున నర్మదను పైకెత్తుకొని పోయినాఁడు.)

నర్మ—(పైకిపోవుచు)నాధా! పురుకుత్సా!శివశివా!నాధా! రక్షింపుము
పురు—అయ్యో! అయ్యో! నర్మదా! నర్మదా! (అని విలపించుచు న్నాఁడు)
నవ—అయ్యో! సఖీ! అయ్యో! ఉరగరాజపుత్రీ! అయ్యో! నర్మదా!
[అని గుండెలు కొట్టుకొనుచున్నది]
విదూ—అయ్యో. ఏమి యీయింద్రజాలము! ఏమి యీయాశ్చర్యము! అయ్యో! రాజా! శాంతింపుము.
పురు—(తూలి క్రింద పడి లేవలేకయుండ సఖుఁడు వానిని కష్టమున పైకి లేవఁదీయుచున్నాఁడు) అయ్యో! నర్మదా!
అంశు—సీ. తను బెనచివైచుదాని పై ♦ కిని గొనంగ
నెగిరిపడి తిరుగుచువడి ♦ యిలకు నెరగె
నితఁడు జాలిని జాలిని ♦ నెగయ లాగ
తిరిగి నేలపై నెరుగుబాం ♦ గరముకరణి.
పురు—అదిగో! అదిగో! కాంత పోవుచున్నది. ఆహా! నర్మదా!
గీ. ఏడుపున నెత్తినైనట్టి ♦ యీక్షణముల
నన్నుఁ జూచుచు పైఁబోవు ♦ నన్నెలంత
ఝుస్సుమనుమంట లవనివై ♦ పుసకుఁ బర్వ
రిన్వ్వనను పై కెగయుపేక ♦ జువ్వమాడ్కి.
విదూ—(పైకి చూచి) ఆశ్చర్యము! ఆశ్చర్యము!
నవ—(పైకి చూచి) సఖీ! నర్మదా!
పురు—ఇఁకను నీయభాగ్యునియందు నీకు ప్రేమయెందులకు?
గీ. ఇద్దఱము గట్టికౌఁగిలి ♦ నెసఁగుచుండ
కంతుకొలఁకచ్చెచటనంటె ♦ నంత వెన్న
ముద్దరీతిని మింటికిఁ ♦ బోయితీవు
కట్టె నిచ్చట దిగద్రొక్కి ♦ కాటికొఱకె.

విదూ——మహామహుల ప్రార్థన మూర్తీభవించి స్వర్గమునకుఁ బోవున ట్లుపోవుచుంటివా? నర్మదా!

నవ——ఓపాతాళరాజపుత్త్రికా! కన్నీరు మున్నీరుగా నేడ్చునీనాథునివిడి చిచిన్నతనమునుండియు నెన్నడును విడువనిసఖినైననన్నుఁ బాసి యెచ్చటికిఁబోవుచున్నావు?

అంశు——వీరివిచారము జూడగ కడుపు దహించుకొని పోవుచున్నది. ఇక్కడ నుండఁజాలను. (అనినిష్క్రమించుచున్నాఁడు.)

పురు——అయ్యో! నర్మదా!

గీ. నీవు ననుఁ బాసి పోవఁగ ♦ నేను దిక్కు
లేనిపక్షికం బెను తక్కు ♦ వైనవాఁడ
వెలఁది పక్షియైనను నాల్గు ♦ విసురు లెగిరి
పోగనంపు నదియు జేయఁ ♦ జాలనైతి.

విదూ——మూర్ఖుఁడా! గుజ్జుమామిడిపండు తినుచిలుకను పిల్లి యెత్తుకొనిబోయిన నెత్తుకొనిపోయితివిరా.

పురు——(తత్తరముతో) ఏమీ! ఏమీ! ఎవరైన నెత్తుకొనిపోయిరా!

విదూ——నీవు చూడవైతివా!

పురు——ఛీ! ఈ వార్త నిప్పుడు చెప్పుచుంటివా! ఎంతబుద్ధిహీనుఁడ వైతివి!

విదూ——దుఃఖము జ్ఞానము నాచ్ఛాదింపదా?

పురు——నిన్ననవేల? నేనే నిర్భాగ్యుఁడను.

గీ. నాతి నెవ్వఁడో హరియింప ♦ నాదుకనులు
మూతఁబడియెను ప్రారబ్ధ ♦ మునకు గాదె
కరముఁజేని చోరుఁడు హరింప ♦ గుఱుక నిదుర
గాంచుమనుజునిమాందభా ♦ గ్యంబుకరణి.

ఆహా! నర్మదా! నేను జీవించి యుండగ వీఁడిపిక్కిలి నీవు న

న్ను కౌఁగిలించి యుండ ని న్నెవఁడో తస్కరించుకొని పోవనే
ననదనై యిచ్చటనుంటినికదా! ఓనర్మదా!

గీ. మదనబాణాగ్ని తపియించి ♦ పిదప నిన్నుఁ
గాంచి శమియింప నెవ్వఁడో ♦ కొంచుఁబోయె
నెండ వడఁ బసి నోటికి ♦ నెత్తుపాన
కలశి నెగఁదన్నుకొనిపోవు ♦ గ్రద్దకరణి.

ఆహా! నర్మదా! నిన్ను హరించినవాఁ డెవఁడైయుండునో?
(నిట్టూర్పువిడిచి.)

గీ. మిస మిసగుయౌవనము జూచి ♦ కసిమసంగి
యెవఁడో ని న్గైంచుగంధర్వు ♦ డేగియుండు
పుట్టప్రాపున సౌఖ్యంబు ♦ బొందుచున్న
యురగకాంతను పక్షీంద్రుఁ ♦ డొడియునట్లు.

(తన్నుద్దేశించి) ఛీ! మూఢా! పురుకుత్సా! ప్రాణాధిక యగు
కాంత నెవఁడో హరింప సిగ్గుమాలినవాఁడవై యేడ్చుచుంటివా!
వయస్యా! ధనుర్బాణముల నిటు తెమ్ము.

విదూ—(విల్లందించుచు) ఉండదెబ్బలకుచుక్కలు రాలునా!

పురు—(బాణమును సంధించి) అదిగో! అదిగో!

గీ. వెనుక తానుండి వనితను ♦ గొనుచుబోవు
నింతి జంపక యెట్లు వ ♦ ధింతు నతని
కుసుమములచాటునందున్న ♦ గుడ్లగూబ
గుసుమములగాల్ప కెట్టుల ♦ గూల్పనగును?

ఆహా! నర్మదా! ప్రాణేశ్వరీ! యెంతదూరమో పోయితివిగదా.
వయస్యా! అదిగో! చూడుము.

గీ. మెలఁతయాస్యంబు ధగధగ ♦ మెఱయుచుండ
కలికి తెలిచీరకుచ్చెళుల్ ♦ గాలిచేత

క్రమముగా క్రింద కుబ్బుచుఁ ♦ గ్రాల తూర్పు
దిక్కునను చెలి యదె తోఁక ♦ చుక్కభంగి.

ధూమకేతుదర్శనము రాజులకు ప్రాణహానికరమే యయినను నాకు పరమసంతోషకరముగ నున్నది.

విదూ—నగధీరుఁడవు! నీవేయ ధైర్యపడుదువా?

పురు—గీ. బిట్టు మరుతాపమున వెత ♦ వట్టియేచ్చి
కొనకు చెలిఁ గాంచి వెంటనే ♦ గూలిపోతి
రాళ్ళజడి నగాగ్రమున మా ♦ ర్గంబు దప్పి
మెఱపుచే దారిగాంచుచు ♦ మేఘమందు
తల తిఱిగి నేలఁబడునరు ♦ దారియయ్యె.

గీ. నిన్న నేఁబెండ్లికొమకను ♦ నేఁడె యయ్యొ
కాంతఁ బాసితి నూరేండ్ల ♦ కాపురంపు
ముచ్చటలు కోట్లు చిటికెలోఁ ♦ జిచ్చుగలసె
మొండిబ్రతుకేల కాలిన ♦ మోదుకరణి.

విప్రవర్యా! ఇక్ష్వాకుకులసంభవులకు సంధించినబాణ ముపసంహరించుట మర్యాద కాదని చెప్పితివికదా.

విదూ—నిశ్చయముగాఁ జెప్పితిని.

నవ—రాజా! ఊఱడిల్లుము.

పురు—నర్మదా! ఓకాంతాలలామ! ఓప్రాణేశ్వరీ! ఇదిగో! నేనును వచ్చుచుంటిని. ఒక్కత్రుటికాలములో నిన్నుఁ గలిసికొనెదను.

గీ. కాలమా! నీకు పం డొాప ♦ గంగఁ జాల
మిడిమిడెండల వడదాఁకి ♦ యొడలునట్టి
పచ్చికాయనె యిచ్చెదఁ ♦ బుచ్చుకొనుము
మతిగతియె ప్రమాణముబహు ♦ మతికిఁగాదె.

హరహరా! (అని బాణము తనపై బ్రేయయత్నించుచున్నాఁడు.)

విదూ—(చేయి బట్టుకొని) రాజా! ఏమిపని చేయుచుంటివి! నేను బ్రాహ్మణుడను, వయస్సు మీఱినవాఁడను, నీతండ్రికాలమునుండి కొలువు సేయుచుండువాఁడను, నీసొమ్ము పెట్టుచున్నంతమాత్రమున నన్నింతయగౌరవపఱతువా! లోకముగానిలోకమునకు నీవు ప్రయాణమై పోవునపుడు దగ్గరనున్న పూజ్యుఁడనైననాతో చెప్పి పోవలదా? ఇంతవిశ్వాసహైన్యమా!

పురు—విప్రవర్యా! నమస్కారము నేనుపోయెదను. సెలవిండు.

విదూ—ఎందులకు.

పురు—నాకాంతను నేను తెచ్చుకొనుటకు.

విదూ—నాయకుఁడు స్వయముగా నాయికకొఱకు పోయి తెచ్చుకొనుక్రొత్తవాడుక నీనాఁడు కలిగినదికదా. ఇంత తెలియనివాఁడవుకనుకనే ఆకాంత నిన్ను విడనాడి పోయినది. ఇప్పుడైనను పూర్వాచరణము ననుసరించి చిరకాలసేవకుఁడనైననన్ను దూతగఁ బంపుము. ఇక్ష్వాకుకులసంభవులను సాధించినబాణ ము పసంహరించుట మర్యాద కాదు! కాదు! ముమ్మాటికి కాదు. ఇదుగో వేదఘోషపవిత్రమగునాకంఠమును నీబాణమునకు గుఱి యిచ్చితిని. ఏమీ! సంకోచించెద వేల?

పురు—ఆహా! విప్రవర్యా! నన్ను వంచించితివిగదా.

విదూ—నిన్ను నీవే వంచించుకొంటివి. వేనవేలకుటుంబముల కాశ్రమగునూరిపై నిప్పు పెట్టఁ దలఁచితివా? కుసుమసుకుమారమగునీమేనునుబాణాగ్ని కాహుతి చేసెదవా? ఇదిగో అగ్నిస్వరూపమయినగాయత్రి యిచ్చట వెలుఁగుచున్నది. అగ్ని నగ్నిలో ప్రవేశపెట్టుము.

పురు—బ్రహ్మహత్యాదోషము గట్టుకొందునా?

విదూ—ఆత్మహత్య యంతకంటె దోషమని యెఱుఁగవా?

పురు—నాకాంత నన్ను విడనాడి పోవుటచే నే నట్లు చేయ యత్నించితిని. ఇక నే నెట్లు బ్రతుకఁగలను?

విదూ—నీవలె రక్తము, మాంసము, చర్మము గలిగినయాకాంతయే నీకు స్వాధీనపడకపోయినప్పుడు రూపరహితమును, భగవదధీనమును నైనమరణము నీవశ మగు నని తలఁచెదవా? తలకుమించినపనులు తలపెట్టెదవా? చేతనైనయెడల నన్నుఁ గొట్టుము.

పురు—వయస్యా! ని న్నేల చంపుదును? ఆత్మహత్యనుగూడ చేసికొనను. లెమ్ము ఇఁక నీవు సంతుష్టిపడితివా!

విదూ—(పెద్దనవ్వు నవ్వుచు) ధనుర్బాణముల నిటు తెమ్ము.

పురు—(ఇచ్చుచు) నర్మదా, నీవు దాఁటిపోయితివికదా. ఇఁక నేను చిరకాలజీవినై యుండెదను.

ఆ. కనులు, చెవులు, నడువఁ ♦ గాళ్ళును లేకుండ
చేతు లసలె లేక ♦ శిరము నేలఁ
గొట్టకొంచు గాలిఁ ♦ బొట్టఁబోయుచు వేయి
వత్సరంబు లుందు ♦ పాములీల.

విదూ—ఆలాగున నుండినను నురగకాంతకు పతియే యనిపించుకొందువు.

పురు—బాణమును సంధించితి వేల మిత్రమా!

విదూ—పుట్టముంగివలె నున్నదీనిని కొట్టుటకు (నవమాలికవంకకను బఱచి)

పురు—నవమాలికా.

ఆ. చిన్నతనమునుండి ♦ జేసినస్నేహంబు
వీడిపోయె నీకు ♦ వెలఁదితోడ
నిన్నగట్టుకొన్న ♦ నెఱకొంగుము ల్లెయో
నేఁడువీడె నాకు ♦ నెలఁతతోడ.

మనమిద్దఱ మొకవస్తువునే గోలుపోవుటచేత సమానదుఃఖము గలవారము. ఐనను, కాదు, నాదుఃఖ మే యెక్కువకదా!

గీ. వెలఁదివెలఁదిమధ్య ♦ గలిగెడు ప్రేమ యు
భ్యసనముననువచ్చు ♦ నది సహజము.
పురుషకాంతలందుఁ ♦ బోరిని నూదిని నూది
హత్త దంటురాతి ♦ హత్తుఁగాని.

విదూ—సత్యము! సత్యము! బూరెయు నేయియు కలియునుగాని బూరెయు బూరెయు హత్తునా?

నవ—అయ్యా నాకు సెలవిమ్మ.

విదూ—నీచెలి కెవరు సెల విచ్చిరి.

పురు—గీ, ఏగి క్రిందకు నచ్చట ♦ నేడ్వ మీవు
నాతి! నే నిచ్చటను రోద ♦ నం బొనర్తు
పైన నెలుఁగెత్తి చాతక ♦ పక్షి, క్రిందఁ
గప్ప, యొక్కవానకె యేడ్చు ♦ కరణిగాఁగ.

నవ—అయ్యా! నమస్కారము. సెలవు దీసికొనెదను.

పురు—సరే పొమ్ము. (నవమాలిక నిష్క్రమించుచున్నది.) ఏమియుఁ దోఁచుట లేదు. మిత్రమా! ఏమి చేయుదము?

విదూ—ప్రశస్త మైన తెలకపిండి దెప్పించి—

పురు—వయస్యా! ఎప్పుడు భోజనదృష్టి యేనా?

విదూ—ఏడ్చియేడ్చి మెరుగురాచిననీగొంతుకకు తెలకపిండివంటివస్తువు మఱియొకటి కలదా? నీబొంగురుగొంతుకను విన్న దేవిగారు నిన్ను నుమానింపరా?

(అప్పుడు సుమతిచేటికయగుకళ్యాణి ప్రవేశించుచున్నది.)

కళ్యా—రాజేంద్రా! నమస్కారము.

పురు—(సంభ్రమముతో) ఇపుడు వచ్చితి వేల?

కళ్యా—దేవిగారిసెల వైనది. తాము దయచేయవలెను.

పురు—(అపవారించి) మిత్రమా! ఇప్పు డెట్లు పోదును! పోక పోయిన తానే యిప్పటికి వచ్చునేమో! ఏమిచేయుదము?

విదూ—కళ్యాణీ! రాజుగారికి కొంచెము జబ్బుగ నున్న దని చెప్పుము.

పురు—మిత్రమా! అట్లనేద వేల? కళ్యాణీ! అతనికి తెలియదు. (తనలో) ఏమని తిరిగి వర్తమానము పంపుదును?

కళ్యా—ఏమి! మహారాజా! తాము చింతాక్రాంతులై యున్నారు.

పురు—(లేచి కళ్యాణిచేయి బట్టుకొని) ఏమియు చింత లేదుసుమా! దేవిగారికట్టిది యున్న చింత యేల? చింతించుచుంటి నని చెప్పెద వేమో! ఇదిగో! బహుమానముగా ఈయుంగరమును తీసికొనుము. (అనియొక యుంగర మిచ్చుచున్నాఁడు.)

విదూ—నర్మద నీ కిచ్చినమణియుంగర మిచ్చెద వేమో సుమా! కొంప మునుఁగును.

పురు—(విదూషకునివంక నెట్టబారి చూచి) రాచకార్య మేదో సఖుఁడునుతాను పరిశీలించుచుండి రని చెప్పుము.

కళ్యా—చిత్తము. అటులే చేసెదను.

విదూ—మశూచికముతో వెనుకటిరోగములునశించినట్లు నీవర్తమానముతో నీవెనుకటిదుఃఖము లారినవా?

పురు—చాలు మిత్రమా! బాగుగఁ జేసితివి.

విదూ—అసలు పెండ్లాముయొక్క వార్త యిటువంటిపై దుఃఖములకన్నిటికి నుచ్చాటనమంత్రము సుమా! వయస్యా! అన్ని విధములదేవిగారు నిన్ను సుఖపెట్టుచుండ నీ వన్యకాంత నపేక్షించుట యుచితమా?

పురు—ఇప్పన ఖా! సుమతితో సుమారు, ఇరువది సంవత్సరములనుండి సంసారమును చేయుచుంటిని. అయిన నొక్కపుత్రుఁడైనను

దవఁ డమ్యెను. మరియొకకాంతను వివాహ మాడినయెడల నామెవలన నైనను నాకీకొఱంత వాయఁగల దను నపేక్షచే న న్యకాంతాసక్తి నుంటినిగాని కేవల మనేకకాంతాలోలత్వము చేఁ గాదు. అట్లుండ నత్యంతసౌందర్యవతి యగు నగ్మదనాకన్న లను బడి కొండంతయాస కలిగించి తుద కీవిధముగఁ జేసి పోయినది నర్మదను మాచునాశ నాకు లేదు. సంతానాపేక్ష మొనలే లేదు. మిత్రమా! ఏమిచేయుటకును తోఁచకున్నది. ఏమిచేయుదము.

విదూ—ఆశ లన్నియు నడుగంటినప్పుడు హరినామస్మరణకంటె చేయఁ దగిన దేది! (హరినారాయణ హరినారాయణ) అని పాడుచున్నాఁడు.

[తెరలో హరినారాయణ హరినారాయణ యనిధ్వనికలుగుచున్నది.]

విదూ—ఏమీ నాప్రతిధ్వనివలె నే మఱియొకనాదము వినఁబడుచున్నది! ఓహో! ఎవరో మహాముని వీణ చేతఁబుచ్చుకొని నారాయణస్మరణచేయుచువచ్చుచున్నాఁడు దూర్వాసుఁడై యుండడుకద!

పురు—మిత్రమా! నారదమహాముని యైయుండును.

(అప్పుడు నారదమహాముని ప్రవేశించుచున్నాఁడు.)

పురు—మహర్షి శేఖరా. నమస్కారము.

నార—రాజోత్తమా! మనోరథసిద్ధిరస్తు.

పురు—తమయాశీర్వాదనఫలముచే మనోరథసిద్ధి కావలెనుగాని నాయదృష్టఫలమునఁ గానేరదు.

నార—రాజా! అట్లనుచుంటివి వేమి?

పురు—మహర్షిచంద్రమా! మఱేమియు లేదు.

నార—ఇంద్రునిసందేశమును వినుము. ఇంద్రలోకమం దొకచిత్రమగు నాటకమింద్రుని సన్నిధిఁ బ్రయోగింపఁబడును. ఒకభూలోకరాజ

స్వ్యనిచరిత్ర నాటకముగ నాడఁబడును. ఆనాటకమును జూచు టకు మనుమడ వగునిన్ను స్వర్గమునకు వెంటబెట్టుకొని రమ్మని యింద్రుఁడు నన్ను ప్రార్థించి పంపెను. కావున నీవు నావెంట నిప్పుడే రావలయును.

పురు—అయ్యో! మహానుభావా! నాచరిత్రయే యొకచిత్రమైననాటక మైనది. దిక్కుమాలినవాఁడనై యిక్కడ విలపించునాకు వేఱు నాటకము లేల? ఉత్సవము లేల? తను వేల? ఏభోగము లైనను చిత్తశాంతిగలవానికి గదా!

గీ. ఆశ లన్నియు భగ్నంబు ♦ లైన తనువె
భారమైయుండఁగూలంగఁ ♦ బడితిఁ గ్రింద
నుట్టిచేరులు నాలుగు ♦ నూడిపోవ
పాలకుండ భళ్లున నేలఁ ♦ బడినభంగి.

నార—రాజా! అంతయధైర్యపడుట కేమికారణము?

పురు—మహానుభావా! ఆజ్ఞ యిచ్చితిరి. గనుక మనవి చేసెదను.

ఆ. ఉరగలోక మొంది ♦ యురగకాంతను జూచి
పెండ్లి యాడి పెండ్లి ♦ పీటలందె
విధురదశను జెంది ♦ వెతలచేతను మోము
వాచి యుంటిఁ జావుఁ ♦ జూచుటకును.

నార—(తనలో) ఇది యంతయు నింద్రునిచే విన్నదే కదా. [ప్రకాశముగా] రాజా! ఉరగకాంతను పెండ్లికూడ నాడితివా!

పురు—మహానుభావా!

ఆ. ముద్దులుంగరములు ♦ మురిపెంపుకౌఁగిళ్లు
మదులు మార్చుకొంటి ♦ మదియు నేను
త్రాడుగట్టనట్టి ♦ యాలోటు లేకుండ
గొంతు త్రాడుపోసి ♦ యింతి పోయె.

నార—ఆ. కష్టసుఖము లెందు ♦ గాత్రధారికి నైజ
మగును వాని కింత ♦ యడల నేల?
కాలగతిని సుఖము ♦ కష్టంబు వచ్చును
ధాత్రిగతిని పగలు ♦ రాత్రివోలె.

అనేకచక్రవర్తులు ప్రపంచమం దష్టకష్టములఁ బడి తుదకు ఫల
ముగాంచి సంతసించి రనుసంగతి ప్రత్యక్షముగ నాటకములవల
నఁ దెలియును. నీవు నట్లే సుఖపడవచ్చును. ఇంద్రునియొక్క
యాజ్ఞ, త్రిలోకసంచారి యగుమునియొక్క సందేశము, చూచు
నది నీతిబోధక మగునాటకము, చూడకుండఁ దగునా! విధేయుఁ
డవై వచ్చితి వని యింద్రుఁడు సంతసించినను హరినామస్మరణ
పరాయణుఁడ నగు నేను సంతసించినను నీమనోరథసిద్ధి యగును.
కావున వేగమ లెమ్ము.

పురు—చిత్తము. మహానుభావా! ఇదుగో! వచ్చుచున్నాను. వయ
స్యా! ఇంద్రుని యాజ్ఞచే నారదమహర్షి వారివెంట నే నింద్రలో
కమునకు నాటకాలోకన కుతూహలమున వెళ్లితినని నీవంతఃపుర
మునకుండు దేవిగారితోఁ జెప్పుము.

విదూ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

పురు—మహర్షి శేఖరా! కామగమనుల రగుతమతో నేనుగూడ నూ
ర్ధ్వలోకమున కెట్లురాఁగలను?

నార—నీ కట్టిసందేహ మేల? నామాహాత్మ్యమువలన నిన్నాకాశగ
మనమునఁ దీసికొనిపోయెదను.

[పురుకుత్సనారదు లిద్దఱును పైకిఁ బోవుచున్నారు.]

పురు—అయ్యో! నాకాంతయు నిటులే యెగిరిపోయెనుగదా [అనియి
ద్దఱును నిష్క్రమించుచున్నారు.]

తృతీయాంకము సంపూర్ణము.

---

శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.

[చతుర్థాంకము.]

రంగము—ఇంద్రలోకము.

(ఇంద్రుఁడు, శచీదేవి, బృహస్పతి, సూర్యుఁడు, చంద్రుఁడు; ప్రవేశించుచున్నారు.)

ఇంద్రు—ఆచార్యోత్తమా! తాము సెలవిచ్చినప్రకారము సర్వమును సిద్ధపఱుచుట కుత్తర వ్వైసఁగినాను. ఇఁక నవశిష్ట మేమియు లేదు. పురుకుత్సునిరాకకొఱకే నిరీక్షించుచుంటిని. అయినను సేవకా! నాటకసంఘాధ్యక్షు నిటు పిలువుము.

సేవ—చిత్తము. (అనిపోవుచున్నాఁడు.)

ఇంద్రు—శచీ! నీతో నాకుఁ గలిగినపంతమునకుఁగదా ఈనాటక మిష్ట డాడించి పురుకుత్సు నిచ్చటికి పిలుపింపవలసి వచ్చెను! అయినను నీవే గెలుతు వేమో! నీపంతము గెలుచుటయే నాకును బరమసమ్మతము.

శచి—(నవ్వుచు) మీరు లోకత్రయాధిపతులు. మీయిష్టమునకు వ్యతిరేక మెన్నఁడైన జరుగునా!

ఇంద్రు—పద్మబాంధవా! ఈదినమునత్వదీయవంశమణి యగుపురుకుత్స చక్రవర్తిశిఖామణిని చూచి మిగుల సంతసించెదవుగాక! కువల

యబాంధవా! నాటకసందర్శన కుతూహలుఁడవై యుంటి విగదా!

(ఇంతలో సేవకుఁడు చిత్రవర్ణునితో ప్రవేశించుచున్నాఁడు.)

ఇంద్రు—ఏమీ! చిత్రవర్ణా! నాటకసమాజమున కధ్యక్షుఁడవైననీచే సర్వమును సిద్ధపఱుపఁబడినదా?

చిత్ర—చిత్తము. దేవరయాజ్ఞ యనుల్లంఘనీయము కదా.

ఇంద్రు—శైలూషు లందఱును, వారివారిగ్రంథభాగమును బాగుగఁ జదివి యభినయించువారేనా!

చిత్ర.—మహాప్రభో! నాటకముయొక్క ప్రయోగానుకూల్యమునకు నాదే భారము.

ఇంద్రు—(రహస్యముగ) శచీ! త్రిపురసుందరీవేషము వేయుదానితో మిగుల జాగరూకతతో నుండు మని చెప్పితివా! తెలివితక్కువు గ నభినయించినయెడల శిక్షింతు నని కూడఁ జెప్పితివా!

శచి—మున్నూటికిని జెప్పితిని.

ఇంద్రు—చిత్రవర్ణా! పురుకుత్సుఁడు వచ్చు వేళ యైనది. కావుననాటక మారంభ మొనరింపవచ్చును. పోయిసూత్రధారుని పిలువుము.

చిత్ర—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

సూర్యు—

గీ. అడుగో! నారదమునివర్యు ♦ నెడమప్రక్క
తనుమహాతనుదీధితుల్ ♦ దనరుచుండ
గ్రాలుపురుకుత్సుఁ డురుశర ♦ త్కాలమేఘ
సన్నిధిని జెంది వెలిగెడు ♦ నన్నుఁబోలి.

బృహ—

గీ. ఉన్నతో దారకులభవుఁ ♦ డొక్క డెవఁడో
దుష్కళంకి యాగాని స ♦ న్మార్తు లగుదు

రందఱును నారికేళాగ ♦ మందు నేది
యో యొదవినట్టిదయ్యపు కాయరీతి.

చంద్రు—(తనలో) దుష్కళంకి నని యీముసలిముని న న్నాక్షేపించుచున్నాఁడు. ప్రత్యుత్తరమున కిది సమయము గాదు.

ఇంద్రు—(తనలో) ఈమహానుభావునిహృదయఫలకమం దీతారాపతి చేసినయక్రమము శిలాశాసన మైనదికదా. ఆదిత్యా! పురుకుత్సుఁడింక నెంతదూరమున నున్నాఁడో చూడుము.

శచి—దేహ మంతటయును కన్నులుగలమీరు చూడక యాతనినిచూడుమనెద రేమి?

ఇంద్రు—(తనలో) ఆహా! ఈమె నాపూర్వకృత్యమును దెప్పి పొడుచుచున్నది!

సూర్యు—పురందరా! నారదపురుకుత్సు లిద్దఱును వచ్చిరి.

(నారదపురుకుత్సులు ప్రవేశించుచున్నారు)

ఇంద్రు—(లేచి) మహర్షిచంద్రమా! పురందరుఁడు భక్తినమ్రుఁడై నమస్కరించుచున్నాఁడు.

నార—కళ్యాణమస్తు.

ఇంద్రు—వత్సా! పురుకుత్సా! ఈయాచార్యోత్తమునకు ముందుగ నమస్కరింపుము.

పురు—సురగురూత్తమా! నమస్కారము.

బృహ—ఇష్టార్థసిద్ధిరస్తు! పురుకుత్సా! (ఇంద్రశచీదేవులను జూపించి)

సీ. వరమధర్మాధిగతులైన ♦ వారి కిరువు
రకును సాష్టాంగ మొనరింపు ♦ రాజవర్య
రజతగిరిగతగిరిసుతా ♦ రాజశేఖ
రులకు మ్రొక్కెడునలకుమా ♦ రునివిధమున.

(పురుకుత్సుఁడు నమస్కరించుచున్నాఁడు.)

ఇంద్రు—పురుకుత్సా! ఇష్టార్థ సిద్ధిరస్తు! ఆచార్యోత్తమా! పార్వతీపరమేశ్వరులకుఁ గుమారునివలె నమస్కరించుమనివీనికాజ్ఞాపించితిరి.

గీ. వీనితండ్రిమాంధాతకు ♦ నేను తండ్రి
వంటివాఁడ నాతఁడు భూమిఁ ♦ బాయ నేనె
తండ్రి నౌదును వీనికిఁ ♦ దాపసేంద్ర
మీరుపలికినమాటలు ♦ మిథ్యలగునె!

బృహ—పురుకుత్సా!

గీ. అమిత తేజః ప్రశస్తుఁడై ♦ నట్టియతఁడె
సూర్యభగవానుఁడౌదల ♦ సోఁక మ్రొక్కు
మతనికులమునఁబుట్టితి ♦ వయ్య! కశ్య
పునికులమున జయంతుండు ♦ పుట్టినట్లు.

పురు—ఓ ప్రభాకరా! భవదీయవంశజుఁడగుపురుకుత్సుఁడు నమస్కరించుచున్నాఁడు.

సూర్య—(లేచి కౌఁగిలించుకొని) వత్సా! చిరాయురస్తు!

గీ. పెద్దవాఁడను వయసునఁ ♦ బెద్దవాఁడఁ
దేజమున నస్మదాభసం ♦ దీప్తు నిన్ను
నాకులంబునఁ గాంచి య ♦ నాకులతను
గంటినది స్వభావమె కుల ♦ కర్తలకును.

నార—(తనలో) వయసునఁ బెద్దవాఁడ ననుచున్నాఁడు. ఆదిత్యులందఱును ద్రిదశులే కదా? దంతము లూడుటచే కాదు. ఊడగొట్టఁ బడుటచే కాఁబోలును పెద్దవాఁడ నని చెప్పుచున్నాఁడు.

గీ. పద్మబంధుఁడు కువలయ ♦ బాంధవుండు
చక్రవర్తియుఁ జేరసీ ♦ స్థలము వెలుఁగు
భవ్యతమలోచనత్రయ ♦ భరితమైన
మదనసాదనువదనబిం ♦ బంబుకరణి.

ఇంద్రు—పురుకుత్సా! నీవలెనే కువలయపరిపాలకుఁడైనయాచంద్రునె కు నమస్కరింపుము.

పురు—(భయపడి వెనుకకుఁ బోవుచున్నాఁడు.)

బృహ—(తనలో) భళీ! రాజా! చండాలునిఁ జూచి దూరమునకుఁ దొలఁగినట్లు తొలఁగుచుంటివే!

పురు—(తనలో) ఓరాజా! నీవు విచిత్రచరిత్రుఁడవు.

గీ. సతియు పతియుఁ గూడినఁ జాల ♦ సౌఖ్య మొసఁగి
విప్రలంభమునను పీల్చి ♦ పిప్పిజేయు
చెలిమి పరిరంభసౌఖ్యంబు ♦ నిచ్చి విరహ
మునను వేధించుహేమంతు ♦ ననుకరించి.

గీ. మింట నినుఁ గాంచుమాత్రనే ♦ మంటలొదవె
మన్మనోగాత్రములయందు ♦ మనుట యెటులు
నేనునీదరి జేరితి ♦ నిపుడు సింహ
గహ్వరముఁజేరుహస్తీంద్రు ♦ కరణిఁగాఁగ.

(ప్రకాశముగ) ఓకువలయబాంధవా! నమస్కారము.

చంద్రు—ఇష్టార్థసిద్ధిరస్తు!

ఇంద్రు—పురుకుత్సా! ఇటఁగూర్చుండుము.

పురు—చిత్తము (అనికూర్చున్నాఁడు.)

ఇంద్రు—సేవకా! నాటక మారంభించువేళ దాఁటవచ్చినది. సూత్రధారునిఁ బిలువుము. (అంతలో సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర—మహేంద్రా! నమస్కారము. నాటక మారంభించుటకు దేవరవారియనుజ్ఞ వేఁడుచుంటిని.

ఇంద్రు—అది యిదివఱకే యియ్యఁబడినది.

సూత్ర—చిత్తము. (నారదుఁడు తుమ్మెదున్నాఁడు)

ఇంద్రు—ఋషిసత్తమా! త్వాము తమ్మితిరే. నాటకప్రయోగము బా గుగనుండకపోవునేమో! లేక మనము నాటకమును సాంతము గఁజూచుట సంభవింప దేమో!

సూత్ర—

ఉ. ఎవ్వఁడు నిర్గుణుం డగు న ♦ హీనశుభోన్నతసద్గుణాఢ్యుఁడై
యెవ్వఁడదృశ్యమూర్తి యగు ♦ సృష్టచరాచరవస్తువాసియై
యెవ్వఁడథోక్షజుండునగు ♦ నెప్పుడురోమ్మునఁగాంతఁగట్టివా
డవ్విభుడాశ్రితార్తిహరి♦హర్తయొసంగెడుమీకుమోక్షముల్

(నాంది నైనతర్వాత తెరపంకఁ జూచి)

నటీ! సింగారించుకొనుట పూర్తి యైనయెడల నిటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యా! సమస్కారము. మీయాజ్ఞను చేయుటకు సిద్ధముగ నున్నాను.

సూత్ర—మహేంద్రునిసన్నిధానమున నిపుడొక నాటకమును బ్రయో గించవలసి యున్నది. త్రిపురసుందరీప్రార్థన మందులకావశ్యక ము గాన నొనరింతము.

నటి— }
సూత్ర— }
గీ. దుర్గసంరక్షితాశ్రిత ♦ వర్గవిష్ణు
నామసంకీర్తననిసర్గ ♦ నవవిలాస
చాకచక్యచలితభర్గ ♦ చరణసేవ
కులమువందనములనుగై ♦ కొనుముతల్లి.

(పాడుచుండగ తెరయెత్తిన నాలయములో నర్మద ప్రతిమవలె బ్రవేశించుచున్నది.)

పురు—(తనలో) ఏమిది! ఏమిది! ఏమిది! నాప్రాణవల్లభ యైననర్మదా యేమి! హా! నర్మదవలెనే కాన్పించుచున్నది. (లేచి తొట్రుపా టుతో) అయ్యయ్యో! నర్మదయే కాఁబోలును! ఆహా! ఇచట కెట్లు వచ్చెనో కదా! ఛీ! నర్మద కాదేమో!

గీ. మృత్యువాతను బడినట్టి ♦ యెగిరిపోవు
నర్మదను నేను తిరిగి గా ♦ నంగఁగలనె?
అగ్ని దేవుఁడు గ్రహియించు ♦ నాహుతితతి
తిరిగి గ్రహియింపలేనట్టి ♦ తీరు గాఁగ.

సూత్ర—క. మాతా! శీతాద్రిసుసం
జాతా! స్ఫీతాంబకజల ♦ జాతా! పూత
ఖ్యాతసుగుణసంఘాతా!
నాతాపము దీర్పుము భృత ♦ నతజనజాతా!

పురు—(తనలో) ఆహాహా! నాబహిఃప్రాణ మైనయురగలోకనివాసినియే
మో కదా.

గీ. ఎండిపోయినయీగాత్ర ♦ మోల్లుపులక
రించు? నర్మదయేగాని ♦ యెడల నిప్పు
డుష్ణతప్తభూభాగమం ♦ దొదవు నెట్టు
లలశిలీంధ్రాళి మేఘోద ♦ యమునఁగాక?.

ఛీ! పురుకుత్సా! భ్రమపడుచుంటివేమో! గర్జారవమునంగాని శి
లీంధ్రములు మొలక లెత్తునా? అయినను ప్రకృతివిరుద్ధ మేమి
యు లే దనుకొనెదను.

గీ. తనకు నమ్మకమైనవై ♦ ద్యవరుఁ గాంచు
తోడనేరోగి కిసుమంత ♦ తొట్రుపాటు
తగ్గి కాసంతయారోగ్య ♦ దశయు వచ్చు
మందు వేయలేదనువెట్టి ♦ మాట యేల?

కావున నిశ్చయముగ నీమె నర్మద యనుకొనెదను. ఈమె యె
వ్వరని యెవరినైన నడిగినఁగాని యీమె నాకాంతయే యని ప
లవరించినగాని వీరందఱు నన్నుఁజూచి నవ్వుదురేమో? అయిన
నెక రేమనుకొందురో యని సంకోచపడుట కవకాశ మీయఁద

గినయవస్థలో లేనైతిని. ఆహా! నాయవస్థ దినదినప్రవర్ధమాన మగుచున్ని పాతరోగియవస్థవలె నున్నది కదా.

గీ. ఈమె యెవ రన దోష మేః ♦ యింద్రు నడుగు
వాఁడు; క్షుధను ప్రాణంబులే ♦ వీడనున్న
పాంథుఁ డొకపండు గాంచి యా ♦ వనమువాని
దానివెల యెంత యనినచో ♦ దైన్య మగునె.

పండు నాకొసఁగు మనిన దైన్య మగు నటువలె ఈమె నాకు సుఖప్రదాయిని గనుక నా కిప్పింపు మని యింద్రు నడిగిన దైన్య మగునుగాని యీామె యెవ్వరని యడిగిన బాధ లే దనుకొనెదను.

ఇంద్రు—పురుకుత్సా! గాలిచే కొట్టుకొను కేతనమువలె నేల యట్లు సంభ్రమించుచుంటివి?

పురు—(చేతులు జోడించుకొని) అయ్యా! ఈత్రిపురసుందరీవేష మభినయించెను వారి లెవరో నే నడిగిన నన్ను మన్నింతురుగాక.

ఇంద్రు—(నవ్వుచు) సూత్రధారు నడుగవలసినమాట నన్నడుగుచుంటి వేమి?

పురు—దేవా! క్షమింపుము. సూత్రధారు నడుగవచ్చునా?

ఇంద్రు—ఎందులకు నీకంత తొందర! (అపవారించి) దేవీ! చూచితి వా! పురుకుత్సునివికారము.

నార—(తనలో) ఆహా! అంతతొందర యెందులకని సహస్రాక్షుఁ డాక్షేపించుచున్నాఁడా! రెండుయామములరాత్రి యుండగనె వడి వడిగపోయి మునికొంప దీసినప్పు డీశాంత మితని కెక్కడఁ బోయెనో!

పురు—ఓసూత్రధారా! నర్మదావేష మభినయించువా రెవరు? (అంద అనవ్వుచున్నారు.)

సూత్ర—రాజేంద్రా! ఇచట నర్మదావేషము లేదే!

పురు—(సూత్రధారుని చేతులఁ బట్టుకొని) నర్మదావేషము గాక యథార్థమైననర్మదయే కద!

సూత్ర—రాజా! మీయభిప్రాయము నాకు తెలియ కున్నది.

పురు—(తనలో) ఒకలు తెలియక నాయభిప్రాయమే నే నెఱుఁగనప్పుడు నాయభిప్రాయము వీనికి తెలియకపోవుట వింత గాదు. (ప్రకాశముగా) అయ్యా! త్రిపురసుందరీవేష మభినయించువారెవరు?

సూత్ర—అయ్యా! క్షమింపుము. అట్లుచెప్పుట సామాజికశాసనమునకు విరోధము. అయినను తాము రాజేంద్రు లాజ్ఞాపించితిరి కాన—

ఇంద్రు—ఏమీ! సూత్రధారా! విశ్వకర్మచే నిర్మింపఁబడిన బంగరు బొమ్మ కాదా?

సూత్ర—చిత్తము. ఆసంగతియే మనవి చేసికొనఁబోవు చున్నాను.

పురు—విశ్వకర్మచే నిర్మింపఁబడినబంగరుబొమ్మయా యిది! (తనలో) నాదియు బంగరుబొమ్మయే కదా. అయిన నది విశ్వకర్మచేగాక విశ్వకర్తచే నిర్మింపఁబడినది. ఓహో! విశ్వకర్మా! సృష్టికర్తసామర్థ్యముకంటె నీసామర్థ్యమే యెక్కువ గనున్నది.

గీ. అన్నివిధముల సాహాయ్య ♦ మందినట్టి
ఘటములను జేయఁజాలఁడా ♦ కంజభవుఁడు
నాతి నర్మదప్రతిబింబ ♦ మైతనర్చు
ప్రతిమనిర్మించునీ కివే ♦ వందనములు.

అయ్యో! నర్మద యని యెంతగా భ్రమసితిని! చిట్టచివరకు బొమ్మను జూచి నర్మద యని సంతసింపవలసివచ్చెను. నిజమైననర్మదనుగాంచి సుఖించుమహాభాగ్యము నాకీజన్మమందు లేదుకదా.

గీ. బొమ్మ నీక్షించి నాముద్దు ♦ గుమ్మ యంచు
నెంచి చివరకు పంక్తిగి ♦ లించినాఁడ
నెండమావులఁ [illegible] ♦ నెం[illegible] యుఱికి
చతికిలంబడు హాహాప ♦ [illegible].

ఆహా! ఆప్రతిమ యెంత దివ్యతేజస్సున మెఱయుచున్నది. సృష్టించిన విశ్వకర్మకును నిది [illegible] యనుగాక యప్రతిమ శోకలితమైనకాంతయని భ్రమింపఁజేయుచున్నది.

బృహ—మహేంద్రా! మఱచిపోయినవస్తువు తిరిగి యాచించువాని వలెనుంటి యిప్పుడు [illegible]?

చంద్ర—(తనలో) తలంపఁబోయినవస్తువును తిఱిగి తెచ్చుకొన్న నీకంటె కట్టులేయుండును.

పురు—మఱచిపోలేను. మఱచిపోవుట కవకాశము లేదు. తిఱిగి తెచ్చుకొనుట కసలే లేదు.

ఇంద్రు—(నవ్వుచు) రాజా! ప్రమైన కథ పొడుచుచుంటివా?

పురు—నేను కథపొడుచుట లేదు గాని, ఈప్రతిమ నాకన్నులను పొడుచుచున్న దని చెప్పుట మీా కందఱకు కథగ నుండునుకద. మహేంద్రా! ఇది యథార్థమైనప్రతిమయేనా?

ఇంద్రు—నీ వాలోచించుకొనరాదా? మాటలు గాని యభినయము గాని దేనియొక్క ప్రయోగము నవసరము లేనిపాత్రను కనుపఱచుటకు ప్రతిమ చాలదా? యథార్థమగునా యని ఇన్నిమాఱు లడిగెద వేల?

పురు—మహేంద్రా! నే నింద్రజాలమునఁ బడియుంటినికదా. ఇఁక నీ గ్గువిడిచి చెప్పెదను. ఉరగలోకమందు వరించి భూలోకంబున పరిరంభసౌఖ్య మొందుచుండఁగఁ గోలుపోయిననాకాంతాశిరోరత్న మగుచర్మదయే యని నన్ను భ్రమింపఁజేయుచున్నయీా

బంగరుబొమ్మను సమీపించి కనులారఁజూచుటకు సెలవొసంగుఁడు.

ఇంద్రు—శచీ! అంగీకరింపవచ్చునా?

శచి—కానిమ్ము. (పురుకుత్సుఁడు లో[illegible] ప్రతిమను సమీపించుచున్నాఁడు.)

చంద్రు—రాజేంద్రా! చిత్రతర నాటకరూపకము సుమా!

పురు—గీ. అమితదూర[illegible] దూరమై [illegible]
నీవు కిరణముల [illegible] గ [illegible]
మించిదియొ[illegible]? [illegible] గాంచి యాట
దోస మగునె? తప్పులుగాదు [illegible] భావము.

బృహ—(తనలో) భళి! రాజేంద్రా! ఈ మీ ప్రతిరూపము [illegible] మునఁబో[illegible].

సూత్ర—ఓ పురుకుత్సా! రాజేంద్రా! త్రిపురసుందరి [illegible] ప్రార్థించుచుండ మీ [illegible] వచ్చెరి.

పురు—ఓ సూత్రధారా! నీ వెందులకు వచ్చితివి?

సూత్ర—దేవీకటాక్షము గోరి ప్రార్థింప వచ్చితిని.

పురు—నేనును దేవీకటాక్షము గోరియే ప్రార్థింప వచ్చితిని.

సూత్ర—నాటకరంగస్థలమున కీర్తులు రాఁగాంచెను. రాజేంద్రా! మానాటకమున కేల యభ్యంతరము కలిగించెదరు?

పురు—అభ్యంతర మేమియు లేదు. ఈ త్రిపురసుందరి—కాదు.—ఈ త్రిలోకసుందరిని ప్రార్థించుటకు వచ్చినన్ను మీనాటకములోని మఱియొక వేషధారిగా భావింపుము.

శచి—(నవ్వుచు) మహేంద్రా! కాంతలను స్వాధీనపఱచుకొనుటకుఁ బురుషు లెన్నియసందర్భవేషముల నైన వేయుదురుసుమా!

ఇంద్రు—(తలపంకించి యుస్సురనుచుఁ దనలో) ఆహా! శచి యహల్యావృత్తాంతమునే తిరిగి యుద్ఘాటించుచున్నది.

గీ. పతులను శ్రేష్ఠుల కనూయ ♦ పడుచు నడుకరు
సతులనాలుకకొన తను ♦ పతుల వంట
గుట్టు మాట లాడఁగఁదగు ♦ నట్టియదను
కొఱకు వేచియుండును తేలు ♦ కొండివలెను.

బృహ—(తనలో)

గీ. శచిచుఱుకుమాటచే నెట్టి ♦ జంభవైరి
కనులు కొలుకులఁ గెంపులు ♦ గ్రమ్మఁగాలు
ఖరకరోజ్జ్వలకిరణవి ♦ కాసమ్మనుల
తరుణ శోణసహస్రప ♦ త్రములకరణి.

ఇంద్రు—నాటక మారంభించకుండఁగనే ప్రయత్నమునకు విఘ్నము కలిగినది. కావున సూత్రధారా! మీరు పొండు.

సూత్ర——చిత్తము.

పురు—అయ్యో! వద్దు. వద్దు. ఈబంగరుబొమ్మకూడనీనాటకపాత్రలలో నొకటి గనుకదీనిని హరించుకొనిపోవుదురేమో! కటాక్షింపుము.

ఇంద్రు—అది యిక్కడనే యుండును. మీరు పొండు. (సూత్రధారుఁడు మొదలగువారు పోవుచున్నారు.)-

పురు—గీ. పరమసంతోష మొసఁగిన ♦ పడఁతిఁ బాసి
పడఁతిరూపంబుఁ గని గుండె ♦ బాదుకొంటి
ఖ్యాతబిరుదావళి నొసఁగిన ♦ కత్తి బోవ
నొఱను గని యేమ్మరణశరం ♦ వరునికరణి.

ఆహా! ఎంతనిర్భాగ్యుఁడను! అపూర్వసౌందర్యవతి యగుకాంతాశిరోమణిని బాసి వలవల నేడువవలసి వచ్చెను. ఛీ! ఇఁక బతుకేల? బ్రతికియుండి యేమియనుభవింపఁగలను?

గీ. కాంత నను వీడిపోయిన ♦ కారణమున
నొడలిశక్తులు సర్వంబు ♦ నుడిగిపోయె

దారువున నున్న జ్వాలిక ♦ తరలి పోవ
వట్టిమసికట్టె మిగిలిన ♦ భాతి గాఁగ.

ఇంద్రు—[తనలో]

గీ. ప్రాణమునకంటె నెక్కువౌ ♦ పడఁతిఁ బాసి
భామరూపంబుఁ గని యేడ్చు ♦ వాఁడతండు
గౌతమునినాతిదైనయా ♦ రాలిబొమ్మ
నేనుచూచిన మాఁకియింత ♦ యేడ్తు నేమొ?

పురు—ఓహో! ప్రియసఖీ! నర్మదా! అయ్యో! యథార్థమైన నర్మదను నేను దూరమైతినిగదా. బొమ్మతో పెనఁగవలసి వచ్చెను. ఎంత ప్రారబ్ధము! ఏమీ! ప్రారబ్ధ మేమున్నది? ఈప్రతిమను జూచుటయైన కొంత యదృష్టమే యనుకొనెదను.

గీ. కాంత బాసినవలవంత ♦ గ్రమ్ముచిత్త
మందు ప్రతిమావిలోకనా ♦ నంద మొదవి
సుఖముదుఃఖంబు నేకమై ♦ సొబగుఁగాంచె
నెండయును వాన యేకమై ♦ యెసఁగునట్లు.

ఇంద్రు—సుఖదుఃఖములయొక్కయైక కాలికసమావేశము పురుకుత్సుని యం దెంతవింతగ శోభించుచున్నది.

గీ. కనులు వర్షించుఁ మోము వి ♦ కాసమొందు;
నొడలు స్తంభించు! గాత్రమం ♦ దొదవు చెమట;
యక్షిగతనీరవాహిని ♦ యైనయంత్రి
జనితరత్న ప్రతిమకట్లు ♦ సముచితముగ.

పురు—మహేంద్రా! జీవనవంతుండనైన నన్ను బొమ్మగఁ జెప్పుచుంటివి. నాజీవనమునకు జీవనమైననర్మదనుగూడనీవేబొమ్మగఁ జేసితివా?

గీ. అంత కింతయ్యె ననుచు దై ♦ న్యంబు కొంత,
దుఃఖశాంతికి నేదియో ♦ దొరకె నంచు

వైర్య మొక కొంత, గ్రమ్మగాఁ ♦ దనరుఁజిత్త
మర్ధసంగ్రస్తచంద్రగ్ర ♦ హణముభంగి.

బృహ—(తనలో) ఆముగ్ధనే తిరిగి తలఁచుచుంటివా!

పుష—గీ. ప్రతిమ నంటుకోరిక ముందు ♦ వంక, కడలు
వెనుకకును, లాగ మది నను ♦ మను గలంగె
తూళ్ళయూస ముందునకును ♦ గాళ్ళనాచు
వెనుక లాగ ప్రసుక్కెడుహంస ♦ విధముగాఁగ.

ఆహా! పరమేశ్వరుఁడా? ఎంతయిక్కట్టు నొందింపఁజేసితివి! అయినను నిన్నన నేల?

ఆ. భయము, సిగ్గు, నెనరు, ♦ బలుశంక, సంభ్రమం
బాశ, సంతసంబు ♦ లన్ని కలసి
చిత్రగతిని గ్రమ్మె ♦ చింతాగ్రహా మది
జలదగతసురేంద్ర ♦ చాపమట్లు.

ఆహా! నన్నెనా! త్రిలోకసుందరీ! ఎచ్చటికిఁ బోయితివి? నిన్ను విడిచినేను బ్రతుకఁగలనా?

గీ. పడఁతిపై నిరాశ ♦ ప్రాణాళిఁబై కీడ్వ
ప్రతిమఁ జూచుకోర్కె ♦ వాని క్రింద
వైపులాగ నడుమ ♦ పరగ స్తంభించె చి
దంబరేశ్వరునివి ♦ ధంబుగాఁగ.

సూర్య—(తనలో)

గీ. పడఁతి యెదుర నున్న ♦ ప్రతిమగా భ్రమపడి
యింత కొట్టుకొనుచు ♦ నేడ్చు నితఁడు
సుఖము చిక్కు నేమి? ♦ సుఖమంచు నెఱుఁగక
బ్రమయునరునిపాట్ల ♦ పార మగును.

ఇంద్రు—పురుకుత్సా! అనవసరముగ నాటకమునకు విఘ్న మొనరించుటయే గాక నీవంతవే మాకుఁగూడ సంతాపము కలుగఁజేయు చుంటివి ఇటు రమ్ము చాలు. ఆహా! విచిత్రచరిత్రుఁడవు!

పురు—మహేంద్రా! క్షమింపుము నేనువిచిత్రచరిత్రుఁడ.

ఉ. ఎట్టులొ స్వప్నలోకమున ♦ కేగి వెలందుక న్గాంచి నే
నెట్టులొ ధాత్రిఁ జేరి మఱి ♦ యెట్టులొ దానిని గౌఁగిలింపఁ దా
నెట్టులొ పోయె నిచ్చటకొ ♦ యెట్టుల బొమ్మను చూడవయ్యెనో
యెట్టులుముందు కౌఁగిలదొ ♦ యిన్నిటికంటె విచిత్ర మేమగున్!

(పురుకుత్సుఁడు ప్రతిమయెదుట రెండుమూఁడుసార్లు నటునిటు తిరుగుచున్నాఁడు)

ఆహా! ఏమిది!

ఆ. ఎదుర నున్ననైన ♦ నిటుప్రక్క, నటుప్రక్క
నున్న నన్నె జూచు ♦ చున్నయట్లు
కానుపించుచుండె ♦ నే నిది ప్రతిమ గా
దంచు నెంచెదను య ♦ థార్థముగను.

(కొంచెము సమీపించి)

ఆ. ఆముఖాబ్జమునుండి ♦ యంభోజవాసన
వచ్చుచుండె నక్కొ ♦ ప్రతిమ గాదు
చేతఁ జేయఁబడిన ♦ చూతఫలంబున
కెటులు సౌరభంబు ♦ ఘటనపడును!

ఇంద్రు—(తనలో) ఆహా! ఇతఁడు ప్రతిమ కాదని నిశ్చయించుకొనుచున్నాఁడుకదా (ప్రకాశముగా) పురుకుత్సా! వెనుక వదలిన భ్రమను తిరిగి గ్రహించుచుంటివా? శిరోజములందలి కమలముల యొక్క గంధమును ఆస్యాంభోజగంధ మని భ్రమపడుచుంటివా?

పురు—చింతచే మతిపోయినవాఁడ నైనను నేను భ్రమపడుట లేదను కొనెదను.

గీ. ఊర్పుతావియె కాకున్న ♦ నువిదచనుల
నడిమిపైఁట నూఁగిచలింపఁ ♦ బడుట యెట్టులు
ప్రసవమంజరులను గప్పు ♦ పండుటాకు
చిఱుతగాలిని గదలిన ♦ చెన్నుమీఱ.

శచి—పురూరవా! ఎంత వెఱ్ఱివాఁడవు. జారుఁడాను మారుతమువలె నెదు రనీవు మాటలాడుచుండఁగా—

పురు—తల్లీ! భ్రమపడితిని క్షమింపుము (ఆలోచించి) అయ్యో! ప్ర తిమగాదు

గీ. తొంగలించెఁ రెప్పల ♦ తుదలయందు
బాష్పకణములు నిలిచెను ♦ ప్రతిమ గాదు
మించుతామరరేకుల ♦ మీఁదఁ దేనె
మంచుకణములు భాసించు ♦ మాడ్కిఁగాఁగ.

ఇంద్రు—పురూరవా! ఎంత వెఱ్ఱివాఁడవు. దానికనులు ప్రశస్తమైనమ ణులచే నిర్మింపఁబడినవి. అమూల్యమణులు నీరుగ్రమ్ముట సహ జమ్మేకద! అదిగాక చంద్రుఁడు సమీపమం దుండుటచే చంద్ర కాంతమణిచే చేయఁబడిన తెల్లగ్రుడ్డు స్రవించు చున్నది. చం ద్రా! యీరాజచంద్రుని భ్రమకు నీవు కారణ మైతివి గనుక నీ వీపాటికి నీలోకమున కేగి సుఖింపుము.

చంద్ర—(నవ్వుచు) చిత్తము (అనినిష్క్రమించుచున్నాఁడు.)

బృహ—(తనలో) ఇక్కడిపీడ వదలినది (ప్రకాశముగా) మహేంద్రా! నేనును పోయెదను. సెలవిమ్ము.

ఇంద్రు—అచార్యోత్తమా! నమస్కారము.

బృహ—కళ్యాణమస్తు (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ఇంద్రు—పురుకుత్సా! అనవసరముగ నాటకమునకు విఘ్న మొనరించుటయే గాక నీవంతచే మాకుఁగూడ సంతాపము కలుగఁజేయుచుంటివి. ఇటు రమ్ము చాలు. ఆహా! విచిత్రచరిత్రుఁడవు!

పురు—మహేంద్రా! క్షమింపుము నేనువిచిత్రచరిత్రుఁడ.

ఉ. ఎట్టులొ స్వప్నలోకమున • కేఁగి వెలందుక నెట్లొ చూచి నే
నెట్టులొ ధాత్రిఁ జేరి మఱి • యెట్టులొ దానిని గాఁగిలింపఁ దా
నెట్టులొ పోయె నెచ్చటకొ • యెట్టుల బొమ్మను చూడనయ్యెనో
యెట్టులు ముందు కాఁగిలనొ • యిన్నిటికంటె విచిత్ర మేమగున్!

(పురుకుత్సుఁడు ప్రతిమయెదుట రెండుమూఁడుసార్లు నటునిటు తిరుగుచున్నాఁడు)

ఆహా! ఏమిది!

ఆ. ఎదుర నున్ననైన • నిటుప్రక్క, నటుప్రక్క
నున్న నన్నెజూచు • చున్న యట్లు
కానుపించుచుంట • నే నిది ప్రతిమ గా
దంచు నెంచెద నయ • థార్థముగను.

(కొంచెము సమీపించి)

ఆ. ఆముఖంబునుండి • యంభోజవాసన
వచ్చుచుంట నద్ది • ప్రతిమ గాదు
చేతఁ జేయఁబడిన • చూతఫలంబున
కెటులు సౌరభంబు • ఘటనపడును!

ఇంద్రు—(తనలో) ఆహా! ఇతఁడు ప్రతిమ కాదని నిశ్చయించుకొనుచున్నాఁడుకదా (ప్రకాశముగా) పురుకుత్సా! వెనుక వదలిన భ్రమను తిరిగి గ్రహించుచుంటివా? శిరోజములందలికమలముల యొక్కగంధమును ఆస్యాంభోజగంధ మని భ్రమపడుచుంటివా?

పురు—చింతచే మతిపోయినవాఁడ నైనను నేను భ్రమపడుట లేదను కొనెదను.

గీ. ఊర్పుతావియె కాకున్న ♦ నువిదచనుల
నడిమిపైఁట నుంతిచలింపఁ ♦ బడుట యెటులు
ప్రసవమంజరులను గప్పు ♦ పండుటాకు
చిఱుతగాలిని గదలిన ♦ చెన్నుమీఱ.

శచి—పురుషోత్తమా! ఎంతవెఱ్ఱివాఁడవు. ఝంఝామారుతమువలె నెదురనీవు మాటలాడుచుండఁగా—

పురు—తల్లీ! భ్రమపడితిని క్షమింపుము (ఆలోచించి) అయ్యో! ప్రతిమగాదు.

గీ. తొంగలించెఱెప్పల ♦ తుదలయందు
బాష్పకణములు నిలిచెను ♦ ప్రతిమ గాదు
మించుతామరరేకుల ♦ మీఁదఁ దేనె
మంచుకణములు భాసించు ♦ మాడ్కిఁగాఁగ.

ఇంద్రు—పురుషోత్తమా! ఎంతవెఱ్ఱివాఁడవు. దానికనులు ప్రశస్తమైనమణులచే నిర్మింపఁబడినవి. అమూల్యమణులు నీరుగ్రమ్ముట సహజమేకద! అదిగాక చంద్రుఁడు సమీపమం దుండుటచే చంద్రకాంతమణిచే చేయఁబడినతెల్లగ్రుడ్డు స్రవించుచున్నది. చంద్రా! యీరాజచంద్రునిభ్రమకు నీవు కారణమైతివి గనుక నీవీపాటికి నీలోకమున కేగి సుఖింపుము.

చంద్ర—(నవ్వుచు) చిత్తము (అనినిష్క్రమించుచున్నాఁడు.)

బృహ—(తనలో) ఇక్కడిపీడ వదలినది (ప్రకాశముగా) మహేంద్రా! నేనును పోయెదను. సెలవిమ్ము.

ఇంద్రు—ఆచార్యోత్తమా! నమస్కారము.

బృహ—కళ్యాణమస్తు (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ర్మదగుండెలు కొట్టుకొనుచు దేవళములోనుంచి యివతలకు వ
చ్చి యింద్రునిపాదములమీఁదఁ బడుచున్నది)

నర్మ—అయ్యో! నాకాంతునితో నన్నుఁగూడ భూలోకమునకుఁ బంప
లేకపోతివా? పుత్రుఁడవని కొండంతయాశ పెట్టుకొంటిని. నా
కిఁక నాతనితో సమావేశము స్థిరముగఁ గలుగునుగదా, యను
ధైర్యముచేత నింతకష్టమునకు నోర్చితిని. నాకాంతుఁడు నాయె
దుట నెంతబాధ పడెనో అంతకు రెండురెట్లుబాధ నేనును లోప
లఁ బొందితిని. నీవు నన్ను శిక్షింతు వను భయముచేతను, ఇఁ
క నాదురవస్థ తీఱఁగలదనునమ్మకముతోను నంతబాధయు నో
ర్చితిని. నాకష్ట మంతయు వృథ యయ్యెను. ఉరగలోకమున
నే నుండ నక్కడ వానితో నొకసారి యెడబాటు నొందితిని. భూ
లోకమున నాతని కౌఁగిలించుటకు యత్నింప నక్కడ రెండవ
సారి యెడబాటు నొందితిని. ఇదిమూడవసారి. మీసన్నిధిని నా
కే విపత్తు రావలసినదికాదు. ఒడలు మండుచున్నది. నోటివెం
ట మాట రాకున్నది. అయ్యో! తల్లీ! నీవైన నీభర్తతోఁ జె
ప్పుము. ఆఁడుదానవు నీకు తెలియని దేదియు లేదు. నీవైన
నన్ను కటాక్షింపుము. ఓతల్లీ! ఓతండ్రీ! నాకు పురుకుత్సునిద
ర్శనము కలుగఁజేసెదరా! నన్ను ప్రాణత్యాగము చేయు మనె
దరా! అయ్యో! నాథా! పురుకుత్సా! మందభాగ్యనైననాకొ
ఱకు నీ కెంతదుఃఖము తటస్థించెను! (అని యేడ్చుచున్నది.)

ఇంద్రు—నర్మదా! అధైర్యపడకు. నీకు పురుకుత్సునియెడలఁ గల
ప్రేమ యెంతయో యిదివఱకె తెలుగుదుము గాని పురుకుత్సు
నియందుగల ప్రేమ యెంతయో మాకు తెలియకపో
చిత్రచరిత్రను నడిపించవలసివచ్చినది. నీ వదృష్టవ
తగునమయ మాలోచించి నిన్ను భూలోకమునకు పంపెదను. ఇ

చారపడవలదు. యథార్థముగ నీవు సుఖింపఁగలవు. ప్రొద్దు పోయినది. శ్రమ పడితివి. లోనికి పొమ్ము.

శచి—నర్మదా? జనువరుము. నీమనోభీష్టము నెఱవేఱును.

నర్మ—నేను నిశ్చయముగ ధైర్యమున నుండవచ్చునా!

(ఇందుని శచి) అవశ్య ముండుము.

నర్మ—నాకు సెలవు దయచేయుఁడు.

ఇంద్రు—వెళ్ళుము. (నర్మద నిష్క్రమించుచున్నది)

ఇంద్రు—శచీ! పురుకుత్సుని ప్రేమ యెట్టిదో కనిపెట్టితివా! నర్మదయొక్క ప్రేమ యెక్కువని నాతో పంతము నైచితివికదా. ఇప్పుడు సంతుష్టిపడితివా!

శచి—పురుకుత్సునిమాటలను విని యతని ప్రేమయే యెక్కువని మీరు భ్రమపడితిరా! చాలు. పరమగాఢమైన ప్రేమ యెప్పుడును మాటలచే వెల్లడింపఁబడునది కాదని మీ రెఱుఁగరా!

ఇంద్రు—కావున నీవే గెలిచితివా? అందులకునాకును సమ్మతమే దేవీ! మిక్కిలి ప్రొద్దు పోయినది. ఇక పోయి శయనింతము. (శచిని కౌఁగిలించుకొని.)

గీ. నీదుసౌందర్యవిభవంబు ♦ నిశ్చలముగఁ
గాంచఁ గనులు సహస్రంబు ♦ గలిగినట్టులు
గాఢపరిరంభసౌఖ్యంబు ♦ గాంచుటకును
బాహువులుగూడ వేయిగా ♦ వలసె నాకు.

శచి—అది యెంతపని మీరు తలఁచుకొనినయెడల మఱియొకయేమునిమైనను కటాక్షింపఁగలఁడు,

[అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.]

చతుర్థాంకము సంపూర్ణము.

శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.

ప్రథమాంకము

రంగము—పురుకుత్సునిరాజమందిరము.

(ముందు విదూషకుఁడును, వెనుకకళ్యాణియు, ప్రవేశించుచున్నారు.)

విదూ—అంతకంటె నే నెఱుఁగను. ఎఱిగినను చెప్పఁదలచుకోలేదు. ఎవరికిచెప్పినను నీకుమాత్రము చెప్పఁదలఁచుకోలేదు. నీకు చెప్పినను, నీవు మఱెవ్వరితోడను చెప్పఁగూడదు. ఎవరితోఁజెప్పినను, నేనుచెప్పితినన్నమాత్ర మెవరికిని దెలియఁగూడదు. అట్లు చెప్పినను రాజుగారితో మాత్రము చెప్పగూడదు. రాజుగారితో చెప్పినను ఇప్పు డాయనకుఁ గలిగినతాపజ్వరము నివర్తించిన పిమ్మట చెప్పవచ్చును. అప్పుడైనను దేవిగారిసన్నిధిని చెప్పఁగూడదు, ఇఁక నేను పోయెదను. (అనిపోవుచుండఁగా.)

కళ్యా—[కూడఁబోవుచు] అయ్యా! పోవద్దు.

విదూ—ఛీ! అవతలకు పొమ్ము. కలకంఠమును కాకి వెంబడించినట్లు నీవు నన్ను విడువకున్నావేమి!

కళ్యా—అయ్యా! మీకంఠధ్వనిని సంపూర్ణముగా వినుటకే కూడ వచ్చుచుంటిని.

విదూ—హాహా! (అనినవ్వుచు) కఱ్ఱదెబ్బ దినుటకు కాదుగదా.

కళ్యా—అయ్యో! తాము పూజ్యులు ఆఁడుదానిని కొట్టుదురా (అని కఱ్ఱనుపట్టుకొనుచున్నది.)

విదూ—కఱ్ఱను వదలుము.

కళ్యా—వదలెదనుగాని కూర్చుండుము.

విదూ—సరే (అని యిద్దఱును కూర్చున్నారు.)

కళ్యా—అయ్యో! మనరాజుగారి కీతాపజ్వర మెందులకు గలిగినదో.

విదూ—వైద్యులు బాగుపడుటకు—జాతకభాగమందు వైద్యులయొక్క వాహనభాగ్యాధిపతులకును, గొప్పవారి రోగాధిపతులకును పరమమిత్రత యని యెఱుఁగవా!

కళ్యా—ఆలాగున కాదు. ఎటువంటివైద్యుఁడు వచ్చినను వానియొద్ద నౌషధముపుచ్చుకొనుట లేదు. సరేకదా, దర్శనమైన నియ్యక నిరాకరించుచున్నాఁడు. ఈవ్యాధితన కిష్ట మగునట్లు చేయునంత టినిస్పృహకు కారణ మేమైయుండును?

విదూ—తుపాను రాబోవుటకుముందు సముద్రము నిశ్చలముగ నుండు ననుసంగతి నీ వెఱుఁగవా!

కళ్యా—విప్రవర్యా! అయిన నేమి?

విదూ—అఖండమైనసంతోషము రాఁబోవుటకు ముందు కొన్నికొన్ని ప్రకృతులకు నత్యంతమైననిరాశ కలుగును.

కళ్యా—విప్రవర్యా! ఈమహారాజునకు మనోవ్యాధియేనా?

విదూ—కళ్యాణి! నీవు జెజ్జిపోతు నెప్పుడైనఁ జూచితివా?

కళ్యా—జెజ్జిపో తనగా నాఁడుదానిని చూచినప్పటికి నీవలె పారిపోవు స్వభావము కలదేకదా.

విదూ—అదే కాదు దగ్గఱకు వచ్చినయెడల నిల్లుతోఁకతోఁ గొట్టు స్వభావముకలది కూడను. [అని కఱ్ఱ యెత్తుచున్నాఁడు.]

కళ్యా—అయ్యో! క్షమింపుము. జెట్టిపోతు ప్రశంస నెందులకు చేసితిరో చెప్పెదరా!

విదూ—రాజుగారివ్యాధి యట్టిస్థితిగనె యున్నది.

కళ్యా—ఎటులు!

విదూ—జెట్టిపోతునందు త్రాచుపాములక్షణములు కొన్నియు ఇతర జాతిపాములక్షణములు కొన్నియు కలసి యుండునుగదా.

కళ్యా—అఖండసంతోష మాసన్న మైనది గనుక నింతచింత కలిగిన దని తాము సెలవిచ్చితిరే! అది యేదై యుండును?

విదూ—భోజన వేళ యైనప్పుడు కడుపు మండుచుండదా? ఇంక నేను పోవలెను (అని పోఁబోవుచున్నాఁడు)

కళ్యా—నేనుమిమ్ము వదలను (అనిచేతులు గట్టిగఁబట్టుకొనుచున్నది.)

విదూ—ఓ దేవీ! ఓ దేవీ! ఈ పెనుభూతమునుండి నన్ను కాపాడుము.

(అప్పుడు సుమతి ప్రవేశించుచున్నది!)

సుమతి—ఏమి! బ్రాహ్మణోత్తమా! ఆఁడుదానిచేతిలో గిజగిజకొట్టు కొనుచున్నావు.

విదూ—మారాజుగారివంటివాఁడే గిజగిజ కొట్టుకొని వ్యాధిగ్రస్తుఁడు కాఁగా ఇఁక నామాటెంత?

సుమ—(తత్తరముతో అపవారించి)

కళ్యాణీ! రహస్య మేమైన వెల్లడించినాఁడా?

కళ్యా—నర్మద, మ కియుంగరము. ఈరెండుమాటలు తప్పమరేమియుఁ జెప్పలేదు. చెట్టుతట్టను ముందు బెట్టి మలపగేదెను పాలుపితుకువిధమున తినుట కేమైన నీతనిముందుఁ బడవైచినయెడల నీరహస్యము మనము గ్రహింపవచ్చు ననుకొనెదను. నేను పోయి ఫలములను తెచ్చెదను. (అని పోవుచున్నది)

సుమ—[తనలో] నేను మాటలాడించి చూచెదను. [ప్రకాశముగా] విప్రశేఖరా! నీవు కాశి కెప్పుడైన పోయితివా?

విదూ—మామామగారు కాలముచేసినప్పుడు.

సుమ—చాలుచాలు. అంతటితో నూరకుండుము. ఆకాశగంగ యెచ్చట పుట్టి యెచ్చటకు వచ్చి యెక్కడకు పోయెనో యెఱుఁగుదువా?

కళ్యా—[ప్రవేశించి] అయ్యా! ఈఫలములను తీసుకొండు.

విదూ—ఆహా! [అనినవ్వుచు] కళ్యాణీ! నామనస్సువంటి ఫలములనే యిచ్చితివి. [ఆసివానివంకఁ జూచుచు] అమ్మా! ఆకాశగంగ స్వర్గలోకమందు పుట్టి, రాజశేఖరునిచే తలపై పెట్టుకొనఁబడి, యంతట భూలోకమునకుఁ వచ్చి, తరువాత పాతాళలోకమునకు బోయెను.

సుమ—నర్మదయో?

విదూ—[తలవంచుకొని పరధ్యానముగా] ఉరగలోకమున బుట్టి, భూలోకమునకు వచ్చి మనరాజశేఖరునిచే కౌఁగిలించుకొనఁబడి, తరువాత రాక్షసునిచే నూర్ధ్వలోకమున కెత్తుకొని పోఁబడెను.

(అనిచెప్పి వ్రేలు కరుచుకొనుచున్నాఁడు.)

సుమ—(అపవారించి) కళ్యాణీ! ఇతఁడు చెప్పినమాటలు అసందర్భములుగ నున్నను నితరవైఖరి చూడగ యథార్థమని తోఁచుచున్నది.

విదూ—(తనలో) అయ్యో. కోపమున మగనిచెవులను నులుమబోయిన వీరపతివ్రతచంకనున్నపిల్ల దబాలున క్రింద పడినట్లు ఆకలిచే నీఫలముల నెలుచుదృష్టి నుండగ నీరహస్యము బయలైనది. ఇఁక నిక్కడ నుండఁగూడదు. (ప్రకాశముగా) అమ్మా! నేను రాజుగారియొద్దకుఁ బోవలెను. సెలవిమ్ము.

సుమ—రాజుగారిపుడే పథ్యము పుచ్చుకొన్నారు.

కళ్యా—అమ్మా! భోజనముకూడ నైనది. నేను చూచి వచ్చినాను.

సుమ—నీవు పోయి యాయనను జాగ్రత్తగ పట్టుకొని తీసుకొనిరమ్ము.

కళ్యా—చిత్తము (అని పోవుచున్నది.)

సుమ—విప్రవర్యా! తనయిష్టమున్న కాంతతో తా ననుభవింపక ననవసరముగ నీమనఃఖేదమును నీదేహవ్యాధియు రాజుగారెందులకు పెట్టుకోవలెను.

విదూ—అమ్మా! ఇక దాపరికమెందులకు! ఆతనిలో కొంతమాత్రము ను లేదు. ఆకాంత యీభూలోకములోనే లేదు. మఱి యెచ్చట గూడనున్నట్లు లేదు. ఆమాదిరి ప్రతిమమాత్ర మొక్కటింద్రుని కచ్చేరీలో నున్న దని రాజుగారు నాతో నీమధ్యనే చెప్పినారు. ఆప్రతిమను చూచుకొనికయే ప్రాణసంరక్షణమందు విరక్తిని గలిగించుచున్నది. రాజుగారు కళ్యాణి నానుకొని వచ్చుచున్నారు. ఆహా! ఏనుఁగుయెత్తుబడినదిగదా!

(రాజును కళ్యాణియు ప్రవేశించుచున్నారు.)

సుమ—నాథా! నమస్కారము. మీకు భోజన మేమైన హితవుగ నున్నదా!

పురు—దేవి

గీ. దుష్టజనునకు నీతి వా ◆ గ్ధోరణివలె
కఠినమానసున కనూన ◆ గానమువలె
విరసజనునకు కవితాని ◆ వేదనంబు
బోలె జ్వరితున కగుఁగాదె ◆ భోజనంబు.

విదూ—అమ్మా! పరస్త్రీని వలచి దానికొఱకుఁ దపించువానికి భార్య యొక్కముందలింపుమాటలవలెనే తాపజ్వరపీడితుఁడైన యీమహారాజునకు భోజన మహితముగనె యుండునుకదా.

సుమ—నాథా! మనకిద్దఱకొకశరీరమే కద.
పురు—సందేహ మేమి?
విదూ—అమ్మా! మీకిద్దఱకు నొకశరీరమే కావున నాయనకు జ్వరము వచ్చుచున్నది. కనుక మీరు లంఘనములను చేయుఁడు.
సుమ—ఒకదేహమేయైనయెడల మనస్సొక్కటిగనుండవలసినదే కదా.
విదూ—అందులకు సందేహ మేమి?
పురు—దేవీ! నన్ను ననుమానించుచుంటి వేమి? మన సాకటిఁయగుటచేత నేదేహములు రెండైన నొక్కటియే యనిపించుకొనుచున్నది.

గీ. జంటపూవుల నొకకాడ ♦ యంటఁ జేయ
గుత్తి యొక్కటి యనిపించు ♦ కొనుచు, పేట
లొనర రెండైనను కొలికి ♦ యొకటి గాన
నొక్కముత్యాలహారమై ♦ యొప్పఁగాదె?

విదూ—దేవీ, మహారాజుగారి వ్రేలియుంగరమును జూడుము! బంగారమును మణియును కలసియున్నను నుంగర మొక్కటి యని యనిపించు కొనుట లేదా! (వ్రేలు గఱచుకొనుచున్నాఁడు.)
పురు—(తత్తరముతో నుంగరమును దీసి దాచఁబోవు) ఛీ! బ్రాహ్మణుఁడా! అనవసరమైనమాటలు నీకేల? దేవి! దేవీ! అతనితో నేమి?
కళ్యా—(అపవారించి) నర్మద యిచ్చినమణియుంగరము దేమైయుండును.
సుమ—(అపవారించి) ఇంకను సందేహ మేమి!
పురు—(తనలో) ఓహో! నర్మదా!

గీ. ఇట్టె వచ్చితి వట్టిపో ♦ యిటివి గాని
సతత మిది నాకు కోత నా ♦ సతికి కోత
అబకాఁడైనసంతిదేవ్రు ♦ లాట చూచి
భోటి యీర్ష్యచే కన్నులఁ ♦ బొడుచుకొనును.

విదూ—(తనలో) బాలవ్యాధి మెరపువలె వచ్చి పోయినను కాల్చుట వలనఁగల్గుమచ్చలు దేహమందు శాశ్వతముగ నిల్చినట్లులీమహా రాజునకు—

సుమ—(అపవారించి) విప్రవర్యా! నాకాంతునిప్రేల నుండవలసినయా తనియుంగరము గనుపడుటలే దేమి? అది నర్మద కీమహానుభావుఁడిచ్చెనా?

విదూ—చెట్టు కదుపునంతమాత్రముననే నేరేడుపండ్లు ఝల్లున క్రింద కురాలినట్లు నేమాత్రము మీరు కదిపినను పట్టులేనినామన స్సునుండి రహస్యము లన్నియును జారిపోవునుగాన—

పురు—(కోపముతో) ఛీ! మూర్ఖా! రహస్యము లని ప్రేలుచుంటివి. రహస్య మేమున్నది?

సుమ—నాథా! రహస్య మేమియును లేదుకద! రహస్య మేమో యని సంకోచించుచుంటినిసుమా! (రాజునొద్ద నున్నయుంగరము బలాత్కారముగ దీసికొనుచున్నది)

పురు—(తనలో)

గీ. నాదుపరభామినీవాంఛ ♦ నాతి కిపుడె
బయలుపడియెనిదర్శన ♦ ప్రకటమగుచు
నాదుతప్పిక నెప్పుకో ♦ నంగవలెను
దొంగిలినసొత్తుతోఁ జిక్కు ♦ దొంగవలెను.

సుమ—నాథా! ఎంతప్రశస్తమైనమణిని సంపాదించితివి!

పురు—(తనలో) నూరుకొని త్రాగుటకుఁదప్ప నాకిఁక దానితోఁ బ్రయోజన మేమున్నది? అహా! చిత్తమా! ఎన్నిబాధలకు లోనైతివి.

గీ. నర్మదాక్షోభ మొకవైపు, ♦ నాతి దూఱు
నేమొ? యనుచింత యొకవైపు, ♦ నీజ్వరార్తి

రెుక్కడిశ, నుండ నుడికెద ♦ వృష్ణకాల
మందు త్రేతాగ్నిమధ్యస్థ ♦ యాజివలెను.

విదూ—(అపవారించి) పడవ నడిపించువాని కింత రాకున్న ప్రయోజన మేమి! కావున నీ విప్పు డవశ్యము బొంకవలెను.

పురు—(అపవారించి) ఏమని?

విదూ—(అపవారించి) ఇంద్రుఁ డీమణి నీకిచ్చె నని!

సుమ—నాథా! ఈమణియే యింతసుందరముగ నున్నది. ఈమణి నీకిచ్చినయామె యెంతసుందరముగ నుండునో?

విదూ—వరాహమింతకంటె మంచిమణుల నిచ్చును.

పురు—(అపవారించి) ఇంద్రుఁ డీమణిని నా కిచ్చె నని బొంకు మంటివా! నేనింద్రలోకమునకుఁ బోకమునుపే నర్మద నీకిచ్చినమణి యుంగర మిచ్చెదవేమో సుమా! అని కళ్యాణి వినునట్లు నీవు నాకు చేసినహితబోధనచేతఁ గదా ఇంత ముదిరినది. అయినను,

గీ. ఎప్పుడైనను నర్మద ♦ నేను గలయు
నాశ నాకున్న బొంకంగ ♦ నగును; జీవి
తాశయే లేనిప్రబలకో ♦ గార్తునకును
మాదుమాటలతోఁ బని ♦ యెందుఁగలుగు?

సుమ—నాథా ఈయుంగరమును స్పృశింప నేనర్హురాలను కాను. నీవే తీసికొనుము. (ఇచ్చుచు) నే నొకమాట చెప్పుచున్నాను వినుము. తాము స్వతంత్రులు. తమ కెవ్వరిపైనైన మక్కువ యున్నచో నాకాంతను మీరు స్వేచ్ఛగా ననుభవింపవచ్చును గాని, నే నేమందునోయనుభయము లేశముగాని మీ కవసరము లేదు. ఆటులభ్యంతరపెట్టుదానను కాను. నాథా! నా మాట విని చింత పెట్టుకొనకవ్యాధిని వృద్ధిపఱుచుకొనక నీమనోభీష్టమును తీర్చుకొనుము.

పురు—దేవీ! నీ వెంతమాత్రమును సంకోచింపఁ బనిలేదు. నేను వల
చినకాంత యేలోకంబునఁగూడ లేదు. నీసవతి యీభూదేవియే
తప్ప మఱెవ్వరును లేరు. కావున నీవు పరితపింపవలసినపనిలేదు
(ఉస్సురనుచు) జ్వరము తగిలెడువేళ యైనది కాఁబోలు! ము
క్కు, చెవులు, నోరు, ఒడలంతయుఁగూడ నార్చుకొనిపోవుచు
న్నది. ఆహాహా, తాప మధిక మగుచున్నది.

సుమ—నాథా! నేను విసరెదను. (విసరుచున్నది) నిద్రమాత్రము రా
నియ్యకుఁడు. కళ్యాణీ! నీవు నాకాంతునిపాదముల నొత్తుము.

కళ్యా—చిత్తము (అని పాదముల నొత్తుచున్నది.)

సుమ—విప్రవర్యా! నాకాంతుఁడు జ్వరబాధచే తపించుచున్నాఁడు పో
యివైద్యునిఁ బిలువుము.

పురు—(వద్దని చేయి యూఁపుచున్నాఁడు.)

విదూ—(చేయిఁబట్టుకొని నాడీపరీక్ష చేయుచున్నాఁడు) అమ్మా! యీ
దినమునజ్వరము నిన్నటికంటె హెచ్చుగ వచ్చినది.

సుమ—అయ్యో! ఏమిచేయుదము! ఔషధము పుచ్చుకొనుమన్నఁ బుఁ
చ్చుకొనకున్నాఁడు. ఈసమయమున నెవ్వరైన మహానుభావు
లు వచ్చి నాకాంతునికి జ్వరబాధ నివర్తింపఁజేసినయెడల నేను
సుఖపడుదునుకదా.

(అంతట పురుషరూపధారిణి యగునర్మద ప్రవేశించుచున్నది.)

నర్మ—ఆహా! ఇప్పటికైన నింద్రునికి నాపై కటాక్షము గలిగినది. నా
నాథుఁడు తాపజ్వరపీడితుఁడై యున్నాఁ డని బృహస్పతి దివ్య
దృష్టివలనఁ దెలిసికొని యాతనికి వైద్యముచేయుమనుచే పురుష
వేషమున న న్నిచ్చటికి పంపించినాఁడు. దేవవైద్యుఁ డననియు,
అమృతహస్తనామకుఁడననియు నే నిఁక ప్రకటింపవలసి యున్న
ది. ఆహా! రాజేంద్రా! తల్లిదండ్రుల, నిష్టభృత్యులను, నివాస

మగునరగలోకమును గూడ వదలి నీకొఱకేకదా భూలోకము
నకు వచ్చితిని. ఆస్థానభ్రష్టత్వము చాలక చిత్రకేతుని చేసికొఱకే
కదా ఇంద్రలోకమున కెత్తుకొనిపోఁబడితిని. ఆయవమానము
చాలక, ఇంద్రసూర్యచంద్రాదులదివ్యసభామంటపమున సిగ్గులే
క నాటకములో మొండివేషము నీకొఱకేకదా వైచితిని. ఇ
ప్పుడు మఱింతసిగ్గుమాలి పురుషవేషమునుగూడ ధరించి, ఈ
రాజద్వారమునొద్ద నీకొఱకేకదా వేచియుంటిని. ఆహా! నీపై
ననురాగము నన్ను మూఁడులోకములఁ ద్రిప్పినదికదా. ఎన్ని
వేషములనైన వేయించినదికదా. ముప్పుతిప్పలను బెట్టుచున్నది
కదా ఇప్పటికైన నీవు లభించినయెడల నేను పరమధన్యురాలను.
వైద్యము చేయుమనుటయే కాని యొక్కమందైన నింద్రుఁడు
నాచేఁ బెట్టినాఁడుకాఁడు. పొమ్మనుటయే చాలని నేను పరుగె
త్తుకొని వచ్చితినికాని, మందబుద్ధినైననాకు మందుమాటయేఁ
జ్ఞాపకమువచ్చినదికాదు. ఏమిచేయుదును! ఎట్లునానాథుఁడు సుర
క్షితముగ నుండునో యేమియు తోఁచకున్నది. ఆహా! దైవ
మా! శుభసూచకముగ నెడమకన్నదరుచున్నది. ఆర్తరక్షణ
పరాయణుఁడైననారాయణుండు రక్షింపకపోవునా. హృదయ
మా! ధైర్యమున నుండుము. ఇంతటనుంచి పురుషలక్షణ మభి
నయింపవలసియున్నది.

గీ. పడఁతి నేనిటు పురుషరూ ♦ పుబుఁగొంటి
నైనను విరుద్ధ మేమున్న ♦ దవనియందు
పురుషలక్షణములు గల ♦ పొలఁతులును
లోన స్త్రీలైనపురుషులు ♦ వేనవేలు.

విదూ—వయస్యా నిద్దుర బోవుచున్నావు.

పురు—సూర్యాస్తమయసమయ మైనది. ఇఁక నిద్రపోయిన నేమి?

సుమ—నాథా! జాగ్రత్త! ఇంక రెండుగడియలవఱకు మేలుకొనుము. (తనలో) శంకరా! భక్తవశంకరా! నాకాంతున కారోగ్య మి చ్చి నన్ను కటాక్షింపుము.

నర్మ—భేదలేశమైన లేకుండ పౌరుష మభినయింపవలసినసమయము వ చ్చినది నిన్ను పురుకుత్సుఁడు గుర్తుపట్టువఱకు నీ వతని మన స్సున కనుమానము గలుగఁజేయునడవడిని నడచినయెడల శిక్షిం తు నని కూడ నాసహాసాగ్నికమహానుభావుఁడు నోటికి తాళము ను, చేతి కరదండములును గూడ వైచినాఁడు. ఆహా! ఎంతద యార్ద్రహృదయుఁడోగదా! ప్రతిమావేష మభినయించుటకం టె యీపురుషవేష మభినయించుటయే యన్నివిధముల కష్ట తరము. ఏల యన, ప్రతిమావేషమందు స్వాభావిక లక్షణము లను స్తంభింపఁజేయుటయేకాని యీవేషమందు నైజలక్షణము లను స్తంభింపఁజేయుటయేకాక విజాతీయలక్షణములనుకూడ నభినయింపవలసి యున్నది. ఆహా! పరాత్పరుఁడా! నాబుద్ధిహీన తచేత నానాథునికి నేను దూర మగునట్లు చేయకుమా! హృద యమా! అనభ్యస్తమైనపౌరుషము నెట్లు గ్రహించెదవో! ధై ర్యమున నుండుము! (ఆలోచించి) అభేద్యమైనపురుషవేష మ మరినది కదా. చిత్తమును భద్రపఱచితినికదా. ఇఁకఁబౌరుషము కూడ రాకుండునా. [ఆలోచించి] అయ్యో! పైలక్షణములచే త నే పురుషుఁడ నెట్లగుదును?

ఆ. తలను పాగ యున్నఁ ♦ దరవారి చేనున్న
నేను పురుషుఁడనుగ ♦ నెట్టులౌదు
పడగ, తోఁక యున్న ♦ వాయు వాధారంబు
నైన గాలిపడగ ♦ యగునె పాము?

పురు—అయ్యో! ఒడలు నొప్పు లెత్తుచున్నది.

సుమ—సఖీ! నేను పాదముల నొత్తెదనునీవు విసరుము.(అట్లుఁజేయు చున్నారు)

నర్మ—నానాథు డెటులున్నాఁడో! అతని చూచుటకు నేను మిక్కిలి సంభ్రమించుచుంటిని. మందబుద్ధియైనవేషధారి తెరచాటునుంచి యొకసారి పుస్తకమును జూచి మఱి రంగస్థలమునకు వచ్చినట్లు నేనును, నన్ను భద్రపఱుచుకొనెదను.

సీ. చూచిచూడనియట్టి ♦ చూపులు విడనాడి
నిశ్చలం బగుచూపు ♦ నిలుపవలయు
తక్కులు, దారుటల్, ♦ టెక్కులు, పలుబోక;
లురు మాని గాంభీర్య ♦ మొనయవలయు
గజయానవై ఖరుల్ ♦ గడలకుఁ బోఁద్రోచి,
హర్యక్షయానంబు ♦ నందవలయు
పంచమస్వరసరి ♦ భావిగాత్రము వీడి,
మందరనాదంబు ♦ నొందవలయు.

గీ. సిగ్గు, తలవంపు, బెదరునుఁ ♦ జెనకినిశ్చ
లతయు నున్ముఖత్వంబు, ధీ ♦ రతయు, నేర్వ
వలయుపలుమాట లేల? స్త్రీ ♦ భావములను
వదలి పౌరుషభావముల్ ♦ బడయవలయు.

పురు—సుమతీ! శిరోవ్యథగ నున్నది. నీవు నాతల నొత్తుము.

సుమ—అటులే!

నర్మ—ఇఁక రాజదర్శనము చేయవలయును. [అటు నిటు నడచి] యుద్ధమునకుఁ బోవుసేనానాయకుఁడు తనసేనాభాగముల కాఖరుమాఱువారివారిచే నిర్వర్తింపఁబడఁదగినపనుల నాజ్ఞాపించురీతిని నేనును నాయవయవముల కొక్కసారి నడుచుక్రమము చెప్పి మఱి పోయెదను.

సీ. అక్షులారా! మీర ♦ లారాజుఁ జూచుచో,
వదనపద్మముమీఁద ♦ వ్రాలవలదు
హస్తంబులార! మీ ♦ రతనిచేఁ జూచుచో,
పరిరంభవాంఛలఁ ♦ బూరయవలదు
వదనమా! యామహా ♦ ప్రభువరుతోఁ బల్క,
నోష్ఠాళి నువ్విళు ♦ లూరవలదు
గాత్రమా! యారాజు ♦ గాలి సోఁకినమాత్ర,
పులకాంకురాదులఁ ♦ బొందఁబోకు

గీ. మఖిలకరణాళి కధిపతి ♦ వైనమనస!
నీవు నాధుని జూచుచో ♦ నిశ్చలముగఁ
బొదల నన్నియు భద్రమౌ, ♦ నుదుటనీవ
బాగుగానున్న సర్వంబు ♦ బాగుగాదె.

ఇదుగో! రాజద్వారము, సేవకా!

సే—అయ్యా!

నర్మ—ఇంద్రునియొద్దనుండి వచ్చిననన్ను మీరాజుగారియొద్దకు తీసికొనిపొమ్ము.

సేవ—చిత్తము. మనవిచేసి వచ్చెదను. [అని రాజునొద్దకుఁ బోయి] మహారాజా! ఇంద్రలోకమునుండి యెవరో వచ్చియున్నారు.

పురు—[దద్దిరపడి] సరీ! సరీ! ఇట్లుతీసికొనిరమ్ము.

సేవ—[తిరిగివచ్చి] అయ్యా! తాము లోనికి దయచేయవచ్చును.

నర్మ—సరే! [అని రాజునొద్దకు వెళ్ళి నిలుచున్నది.]

పురు—అయ్యా! నమస్కారము. ఇట్లుఁదయచేయుఁడు.

నర్మ—ఆరోగ్యమస్తు (తనలో) ఆహా! ఎంతవైపరీత్యము! భార్యభర్తకు దీవించవలసివచ్చెను. (ప్రకాశముగా) అయ్యా! మీ రనారోగ్యస్థితినుంటి రని పురందరుఁడు విని మీయందలియభిమానము

చే దేవవైద్యుఁడ నైననన్ను మీ కారోగ్యమును కలుగఁజేయు
టకొఱకిచ్చటికి పంపించుటచేత వచ్చితిని.

పురు—నే నెవ్వరియొద్ద నౌషధము పుచ్చుకొనఁ దలఁచుకొనలేను.
మీ రింద్రునియాజ్ఞచే వచ్చితిరి గాన నాలోచింతము.

సుమ—[నర్మదకాళ్లపైఁబడి] అయ్యా! నానాథుని రక్షింపుము.

నర్మ—లెమ్ము లెమ్ము (తనలో) నాసవతి నాకాంతునెదుట నాకాళ్ల
బడ నెడ లుప్పొంగుచున్నదికదా.

సుమ—ఓతమ్ముఁడా!

నర్మ—ఏమి! [తనలో] చెల్లెలా! యనిన యథార్థముగ నుండునుకద.

సుమ—నామంగళసూత్రమునకు భద్రము కలుగఁజేసెదవు కద.

నర్మ—[తనలో] పురుకుత్సునిచేతితో నామెడనుగూడ నొకమంగళసూ
త్రమును కట్టించెదవా? (ప్రకాశముగా) అక్కా! పురుకుత్సరా
జేంద్రునకు శీఘ్రముగ నారోగ్యమును కలిగించెదను.

సుమ—అట్లైన నీ కేదికావలసిన నది యియ్యఁగలదానను.

విదూ—అమ్మా! తొందరపడకుము ఈవైద్యుని నమ్మవలసినపని లే
దు. వీనివలన ముప్పు కలుగును.

సుమ—ఛీ! ఎందుచేత.

విదూ—వయసుతక్కువవైద్యుని, వయసుమీరినవారకాంతను నూర
నుండి వెడలఁగొట్టవలసినది కదా.

సుమ—తమ్ముఁడా! నీ వేదికోరిన నది తప్పక యిచ్చెదను.

నర్మ—అక్కా! వైద్యవృత్తి నీచమైనది. కంటికి జోడున్నంతవఱకు
నక్షత్రములు తాటికాయలవలె నగపడి జోడు దీసినతర్వాత న
లుసులవలె నున్నట్లు తనకుఁగాని తనవారికిఁ గాని రోగ మున్నం
తవఱకు వైద్యుఁడు కొండవలె నగపడి రోగము పోయినపిమ్మ
ట నుసిపురుగువలె నుండును.

సుమ—ఇదిగో! నామంగళసూత్రముతో నేను ప్రమాణము చేయుచు న్నాను. నీవు కోరిన దంతయు నిచ్చెదను.

విదూ—అయ్యో! దేవీ! కొంప ముంచుకొంటివా! ఒక్కపలచగనున్న వైద్యు నెన్నఁడును నమ్మరాదుగద.

నర్మ—దాన మీయఁబోయినబలిచక్రవర్తి కడ్డుదగిలినశుక్రాచార్యుని వలెనే యుంటివి!

విదూ—భళి! చక్రవర్తిని నడుగఁద్రొక్కుటకువచ్చినమాయావేషధా రివేనా!

నర్మ—(తనలో) వీఁడు నన్నానవాలు పెట్టెనుకాఁబోలు!

సుమ—తమ్ముఁడా! వానిమాటల కేమి! లెమ్ము.

నర్మ—అక్కా! ఔషధ మారంభింపవచ్చునా?

సుమ—అవశ్యము నాథా! ఈమహానుభావుఁడుమీ కారోగ్యమును క లుగఁజేయుటకు భగవంతునివలె వచ్చినాఁడు. కావున నాతనివై ద్యమున కంగీకరింపుము.

పురు—ఈతఁడు నాకు వ్యాధి కుదర్చఁగలఁ డనితోఁచుచున్నది. ఈతని యొద్ద నౌషధమును పుచ్చుకొనెదను. నీవు ధైర్యమున నుండుు ము. ఇంతవఱకును నీవు భోజనము చేయకుండుట కొంతమా త్రమును బాగుగనున్నది కాదు. కాన శీఘ్రముగ లోనికిఁ బొమ్ము.

సుమ—నేను పోయెదను [పోవుచు] తమ్ముఁడా! యెల్లరక్షింతువుగా!

నర్మ—అక్కా! వాగ్దాన మెల్లు చెల్లించుకొందునుగా! [సుమతియు శ్యామేయును లోనికిఁ బోయిరి.]

విదూ—అయ్యా! తమపేరేమి?

నర్మ—అమృతహస్తుఁడు.

విదూ—(తనలో) తెలివితేట లెటు లుండునో కాని పేరుమాత్రము వి
న్నకడుపు చెక్క లగుచున్నది. [ప్రకాశముగా] అయ్యా! తా
మెప్పుడైన పెరుగుతోటకూరపులుసు పుచ్చుకున్నారా?
నర్మ—ఇప్పుడు దాని ప్రశంస యెందులకు.
విదూ—వైద్యులుగాన నడిగితిని. పెరుగుతోటకూరలోనిపెరుగు ఆ
వుపెరుగా? గేదెపెరుగా? దానిగుణ మేది? ఈరెండుసంగతులు
ను తెలియవలయును.
నర్మ—వెఱ్ఱివాఁడా! పెరుగుతోటకూర యని పే రున్నంతమాత్రము
ననే యందులో పెరుగు గల దని యెంచితివా?
విదూ—అలాగునా! అయ్యా! తమయమృతహస్తనామము నట్టిదే
కాదుకద.
నర్మ—[తనలో] వీఁడు నన్ను వంచింప మొదలుపెట్టినాఁడు. నాకా
ర్య మెట్లు నిర్వహింపఁగలనో!
పురు—అమృతహస్తా! ఆవావదూకునితో నీకు సంభాషణ మెందుల
కు? ఇట్లువచ్చి నాయొద్ద కూర్చుండుము.
(నర్మదరాజునొద్దఁ గూర్చున్నది.)
విదూ—ఈతనిచికిత్సాజ్ఞాన మెట్టిదో తెలిసికొనుటకు కొన్ని ప్రశ్నల
నడిగినయుత్తరముల నొందినతరువాతనే తని వైద్యమున కంగీకరించె
దను గాని—
పురు—అనవసర మైనయాలస్య మెందులకు?
విదూ—పశ్చాత్తాపముకంటె శ్రేష్ఠముగదా.
పురు—కానిమ్ము అడుగుము.
నర్మ—(తనలో) అయ్యో! ఏమి యడుగునోకద.
విధూ—అయ్యా! ప్రపంచమందలిరోగము లెన్ని?
నర్మ—అనంతములుగదా!

విదూ—తప్పు! తప్పు! హాహాహా! (అని నవ్వుచు) పుట్టురోగములు పెట్టురోగము లని రెండే రోగములు. దేహమందు స్వాభావికముగఁ బుట్టెడురోగములు కొన్నియు, మోహాదిదుష్కర్మప్రారబ్ధవశముచే తెచ్చిపెట్టకొన్నరోగములు కొన్నియు నున్నవి. ఈ రాజుగారిది పుట్టురోగమో పెట్టురోగమో బాగుగ పరిశీలించుటయే కర్తవ్యము.

పురు—వయస్యా! బాగుగఁ జెప్పితివి. అమృతహస్తా! మాట లాడుటకుశక్తి లేదు. నాప్రారబ్ధ మేమని చెప్పఁగలను? వైద్యులుమీయొద్ద దాఁచిన వినియోగము లేదు. (ఉస్సురనుచు) అయ్యో! నర్మదా!

నర్మ—(తనలో) నాకాంతుఁ డతిసంభ్రమమున "నర్మదా" యని పిలుచుచుండ నేను సమీపమున నుండియేపలుక కూరకుంటినిగదా. (ప్రకాశముగా) రాజేంద్ర! ఏమో చెప్పబోయియూరకుంటివిగదా.

పురు—(ఉస్సురనుచు) ఏమున్నది? నర్మదయీరీతిగానాగొంతుకోసినదని—

నర్మ—(తనలో) అయ్యయ్యో! హృదయమా! మెత్తబడుచుంటివేమో సుమా! సమీపమున నుండునవయవములయొక్క కాఠిన్యమును కొంతయెరవైనఁ దీసికొనుము. (ప్రకాశముగా) రాజేంద్రా! నీ వెవ్వరినైన వలచి నిరాశతో నుంటివా?

పురు—అయ్యో! ఒకరిని గాదు. ఇద్దఱినివలచి నిరాశతో నుంటిని.

నర్మ—(తనలో) అయ్యో! ఆరెండవ దేవతయెవతెయో? హృదయమా? తూలిపోవుచుంటి వేమో!

పురు—సీ. నర్మదను నేను వలచితి ♦ నాతి నాదు
భాగ్యహీనతచే వశ ♦ పడక పోవ
తిరిగి మృతిని నే వలచితి ♦ దీనిఁగూడ
వశముగాకుండఁజేయంగ ♦ వచ్చి తీవు.

నర్మ—(తనలో)

గీ. రమణుమదిఁ గాంచి యతనిఁజే ♦ రంగనీవు
చిత్తమా పొందెది త్తరి ♦ తత్త్వంబు
గూటనున్న ప్రియుఁ గను ♦ గొంచు గూఁడ
జేర జాలఁ జాలవలాదెను ♦ చిలుకవలెను.

(ప్రకాశముగా) రాజేంద్రా! నీయవస్థఁ జూడ నాకును మిక్కిలి సంతాపకరముగ నున్నది

విదూ—అయ్యా! భిషగ్వర! రోగిగారి యొక్కవా సంతాపము నెం దుచు వైద్యుఁ డుండఁ గూడదు. కాన శీఘ్రముగ తా మింక ద యచేయుఁడు.

పురు—ఇప్పిగో! వయస్యా! ఊరకుండుము.

గీ. చెవికి హాయిగ సంగీత ♦ సేవ నిచ్చి
చిత్త మానందనీరధిఁ ♦ జొచ్చుమృదుల
పరభృతంబును నీ వేల ♦ పారఁదోల
కలిగయత్నుఁడ వైతివి ♦ కాకమ్ముగ్గు.

అయ్యా! వైద్యశిఖామణీ! ఇ గ్రీష్మధామంటపమున నూతనర్మ దాఖ్యామనుబంగారపు బొమ్మ యిప్పుడునుగూడ నచ్చటనే యు న్నదిగదా.

నర్మ—(తనలో) అయ్యో! ఒడలు జలదరించుచున్నదే! ఏమని చెప్పవ లెను? (ప్రకాశముగా) నీయెదుట నాప్రతిమ యేలాగున నుండె నో! ఇప్పుడునుగూడ నాలాగుననే యున్న దనుకొనుము.

పురు—తాపజ్వరముతో నున్న నాకుఁ దాపాపహకర్యమునకని దీపమును దూరముగ నుంచుకారణమున నీరూపము నాకంటికి బాగుగ నా నకున్నను, నీకంఠస్వరమును వినినతోడనే విశేషపరిచిత మగు రాగమునుగుర్తుపట్టినట్లు నాకర్ణములు శోభిల్లుచున్నవి. కను

లకుఁగూడ నానందమును గలుగఁ జేయునుగాక. వయస్యా!
పని చెప్పితినని కోపపడక యీదీపము నిటు లుంచుము.

విదూ—(తనలో) రాజు తనరోగమును మఱచినాఁడు. వైద్యుఁడు తన వైద్యమును మఱచినాఁడు. నేను బ్రాహ్మణత్వమును మఱచి సేవకవృత్తిని జేయుచున్నాను (దీపమునుఁ దీసికొని వచ్చి సమీపమం దుంచినాఁడు)

నర్మ—(తనలో) ఓచిత్తమా!

గీ. తోడను చీఁకటియును నీవుఁ ♦ దోడుదొంగ
లగుచు నన్గాచితిరి యింక ♦ నయ్యో! యొక్క-
దొంగ చిక్కె దీపిక చేత ♦ దొరుకు దేమొ
నీవు రాజేంద్రవదనను ♦ దీప్తి చేత?

పురు—(నర్మదముఖమువంకఁ జేరిపారఁ జూచి తొందరతో) మిత్రమా, ఆహాహా! అత్యాశ్చర్యకరముగ నున్నది. ఈమహానుభావుని నీవుఁగూడ బాగుగఁ బరిశీలించుము.

విదూ—(పరిశీలించి) ఈతనిముఖము మూషివాయణపుముత్తైదువ మొగములాగున నున్నది.

పురు—ఛీ! వ్రేలరి. ఓయమృతహస్తా! నాయిష్టసఖుఁ డేమైన ననందర్భవాక్యములను బలికినచో నీ వాగ్రహపడకుము సుమా. వయస్యా! ఇంకొకసారి బుద్ధి కలిగి పరిశీలించుము.

గీ. నర్మదను బోలుపురుషర ♦ త్న మగువీని
ముఖము జూడఁగ నుబ్బుచు ♦ పొరలి మేర
మీఱి పొంగి నాచిత్తము ♦ మించు; పూర్ణ
శీతకరుఁ జూచునంభోధి ♦ రీతిఁగాఁగ.

నర్మ—(తనలో) చిత్తమా! తొందరపడకు.

గీ. సంభ్రమము గట్టిపెట్టుచు ♦ శాంతముగను
సౌఖ్యమొందుము త్వరపడ ♦ సౌఖ్యభంగ
మగును; దాహార్తుఁడగునాతఁ ♦ డతిరయమునఁ
బాన మొనరించుచోఁ బొర ♦ బారుఁ గాదె?

పురు—వయస్యా! ఈమహానుభావుఁ డేమోకాని మూఁడుమూర్తులను నానర్మదనుఁబోలుచున్నాఁడుసుమా.

గీ. మోముపై ఖరి యల్లదే; ♦ ముదితవ్రేళ్ళ
తీరు నయ్యదె; మాటల ♦ సౌరు నదియె;
మగతనము వచ్చి యున్నంటి ♦ నగడుచేసె
మాచుబడి మోటుదేరుప ♦ ద్మములమాఱ్కి—.

విదూ—నే నిప్పుడు బాగుగఁ బరిశీలించితిని, ఇతఁడు మాచకమ్మవలె నున్నాఁడు. ఈపేడిమోము జూడరాదు గావున వీని నిచ్చట నుండి యిప్పుడే వెడలఁగొట్టవలెను.

పురు—అమృతహస్తా! వానిమాటలతో నేమి. మోహావేశమున నే నే మైనన ప్రియవాక్యములను బలికినచో క్షమింపవలయునుసుమా! నీవు నర్మదకు సోదరుఁడవు కావుగద.

నర్మ—నర్మద యెవరో, దానిసోదరుఁ డెవఁడో, అదియెచట నున్నదో, కూడ నేనెఱుఁగకున్నవాఁడను. కానిమ్ము! రాజేంద్రా! అనవస రమైన సంభాషణములతో పనియేమి. నీచేతి నిట్లు తెమ్ము.

పురు—(చేతినిచ్చుచు)

గీ. నాదుదక్షిణహస్తంబు ♦ నర్మదాను
భాంగి కొసగంగఁబడియె నో ♦ యమరవైద్య!
నీవునర్మదరూపున ♦ నివ్వటిలుట
నీకు నిచ్చెద మొకసారి ♦ నెమ్మినిదిగో!

విదూ—(ఆహాహాయని నవ్వుచు) ఆమొకరము నీ కియ్యఁబడినదా? నీక రమామె కియ్యఁబడినదా? ఎంత యవశుఁడ వైతివి.

నర్మ—(నాడీపరీక్ష జేయుచు) (తనలో)

గీ. నాదునుదికంటె వేగ మీ ♦ నాడి కొట్టు
కొనుటలే; దైన స్వాతంత్ర్య ♦ మున నితండు
త్రాస మొందెను; నే నాఁడు ♦ దాననింద్రు
కట్ల నుంట తాపం బరి ♦ కట్టవలసె.

రాజేంద్రా! ఇప్పుడు నీ కెట్టులున్నది?

విదూ—ఎట్లుండుటకును నీవు చేసినప్రయోజకత్వ మేమి?

పురు—గీ. ఈవు చేఁజూడ నొకలెల్ల ♦ నేదొ ఝల్లు
ఝల్లుమనుచును గ్రమ్మెను ♦ చల్లగాను
వ్రేళ్ళపైఁ బెట్టి కదుపగ ♦ ఘల్లుమనుచు
వేగ ధ్వనియించుసంగీత ♦ పేటివలెను.

విదూ—ఆహాహా! రాజేంద్ర! అంజనపురుముగ్గున గూర్చున్నవానివలె మిక్కిలి స్వతంత్రబుద్ధితో మాటలాడుచున్నావు!

పురు—అమృతహస్తనామము సార్థక మైనది. అయ్యా! కరుణించి యింక నొకసారి చేయిజూడుము

నర్మ—నాడిని గ్రహించితిని; యింక నవసరము లేదు.

పురు—గీ. కరమునను బాధ యేదియు ♦ గలుగ లేదు
ఉన్న బాధలు వక్షమం ♦ దున్న వయ్యా!
అచటఁగూడను నీచేతు ♦ లలమి తాప
శాంతిఁ జేయంగ నింక నవ ♦ సరము గలదు.

విదూ—చిల్లిపడినకుండలోనుంచి నీరు ప్రాకిఁపోవునటులు నీజ్ఞానము న శించుచున్న దిసుమా!

నర్మ—[తనలో]

సీ. ప్రేమచేఁబూర్ణమైనట్టి ♦ వెలఁదిమనసు
వెలువరింపకయుండంగ ♦ గలుగు టెటులు?
గట్టునను నీరువిరుగఁగఁ ♦ గెరలుకమల
వెల్లిగొనకుండ నిలుపుట ♦ కల్లగాదె?

ఈయనురాగవికారమును నే నిఁక మఱుఁగుపెట్ట సమర్థురాలను గాను. ఆహా! భగవంతుఁడా! నాకాంతుఁడు నన్ను శీఘ్రముగ గుర్తు పెట్టునట్లు కటాక్షింపుము. కానిమ్ము. ఇటులకొంత సాహసింతును. [ప్రకాశముగా] రాజేంద్రా! నీయిష్టసఖుఁడు చెప్పినట్లు యిది పెట్టురోగమే. దీని కౌషధములు లేవు. మంత్రములవలననే యీవ్యాధిని సాధించవలసి యున్నది. నేను నీతోడపైఁ గూర్చుండి నీమెడపై చేయివైచి యొకపావుగడియ సేపు జపము చేయవలసి యున్నది. అదినీకంగీకారమేనా?

పురు.—(పెద్దనవ్వునవ్వుచు) ఎంతవెఱ్ఱివాఁడవు. అందులకు నే నంగీకరించకపోదునా! ఏదీ! ఇట్లుశీఘ్రముగ రమ్ము.

(అని తన తొడపైఁ గూర్చుండబెట్టుకొనుచున్నాఁడు)

(నర్మద జపము చేయుట నభినయించుచున్నది)

పురు—(తనలో)

ఆ. ఉరగలోకమందు ♦ నువిద నాతొడపైని
నెనసియున్నయప్పు ♦ డిట్టిసుఖమె
పొందినాఁడఁ గానఁ ♦ బురుషుఁ డీతఁడు గాఁడు
కోర్కెలిచ్చునాదు ♦ కొమ్మ యేమొ?

(తనలో) అయ్యయ్యో! ఈదౌర్భాగ్యున కంతయదృష్టమా! ఓ యమృతహస్తా!

గీ. పడఁతి వీనైన నేసుఖ ♦ పడుదు; నేను
కాంతనైనను నీతో ర ♦ మింతు; నటులు

నోచ లేదయ్యె హా కృప ♦ బుండగుణాల
నెలమి నిర్భాగ్యకవి యాశ్ర ♦ యించునట్టులు.

విదూ—భాన్యపుపాతరపై మొలచినకుక్కగొడుగువలె నితఁడు నీతో
డపైనున్నాఁడుకదా. వయస్యా! యెంతపరాధీనుఁడ వయితివి!

నర్మ—(లేచి) రాజేంద్ర! నాజప మైనది. నీకెట్టులున్నది.

పురు—నా కేమియుజబ్బులేదు. అత్యంతసుఖవంతుఁడనై యున్నాను.

గీ. భవ్యభవదీయగాత్రసం ♦ స్పర్శనమున
తాపహృతి కాక సౌఖ్యవ ♦ ర్ధనము నయ్యె
పూర్ణశశికరసంస్పర్శ ♦ మున చకోర
మునకు నత్యంతసంతోష ♦ మొనసినటులు.

నర్మ—నీకు సుఖముగ నున్నది కావున నే నిఁక పోయెదను.

పురు—(నర్మదయొక్క రెండుచేతులను పట్టుకొని) అయ్యో! అయ్యో!
నన్ను విడిచి పోయెదవా?

గీ. నర్మదను గాంచుభాగ్యంబు ♦ నాకు లేదు
నాదుపాలిటి కీవైతి ♦ నర్మదగను
రాష్ట్రమింక నీదె నీవె నా ♦ రాజ వైతి
వుండు మిచ్చట నిన్నేలు ♦ చుందు నేను.

విదూ—నీరాష్ట్రముతో నితని కేమిపనియున్నది? ఈతనికనువగు రాష్ట్ర
మునే నిచ్చెదను.

పురు—వయస్యా! రాష్ట్రమునిచ్చునంతవాఁడవా?

విదూ—ఒకటికాదు. రెండు. చంపరాష్ట్రము, కళింగరాష్ట్రము.

పురు—చాలు. అయ్యో! (నర్మదవంకదిరిగి) నారాజ్యమును నీవంగీకరిం
పవలయును.

విదూ—వయస్య! అయ్యయ్యో! ఎవఁడో మంత్రగానికి పూర్వార్జితమై
ననీరాజ్యము నర్పణచేయఁ దలఁచితివా! ఆహాహా! ఎంత మతి

మాలినవాఁడ వయితివి! మోహావేశముచే నాఁడుదాని కిచ్చిన నింతనగుబాటు లేదుకద. అయ్యయ్యో! మగవానికి వలచి యీయప్రయోజకత్వమును చేయుచుంటివా! అమృతహస్తా! నేను చెప్పుచుంటిని. నీవు మాంత్రికుఁడవు. రాజా! నీవు మొదటే రాజ్యమత్తుఁడవు. తరువాత మోహపీడితుఁడవు తత్కారణమున జ్ఞానశూన్యుఁడవు. అందుపైని ప్రజ్వరార్తుఁడవు మీ దిమ్మికలినీతని మంత్రములుకూడ నీతల కెక్కినవి ఈసమయమునఁ జేసిన వాగ్దానము వాగ్దానముగాదు. ఇచ్చినీవి యీవికాదు. జాగ్రత? జాగ్రత్త. ముందే చెప్పుచుంటిని

పురు—(కోపముతో) వయస్యా? నీకునోరు మూఁతపడదుకద.

విదూ—నన్ను తిరస్కరించుచుంటివా. నీకు నేను జనునను పూర్వార్జితమైనరాజ్యము నీఁటగలపిపోవుచుండ నే నూరకుండవలెనని కొంటివా? మతి యున్న వానికి నోరు మూఁతపడనక్కఱలేదు మతి పోఁగొట్టుకొనినవానికి మతికంటె నోరే ముందు పోయినయెడల మానధనప్రాణోపద్రవకరమగునాప్రలాపములు పలుకుట తటస్థపడదుకద!

శర్మి—నాకు నీరాజ్యముతో పని యేమి? నీతో పనియుండియే వచ్చితిని. నీ వేసర్వమును పరిపాలించుకొనుము.

పురు—అట్లుకాదు. నారాజ్యమును నీవు స్వీకరింపక తప్పదు. నీకు నేను సేవకుఁడ నగుదును.

విదూ—అయ్యో! నాప్రారబ్ధము! నాకుదాస్యానుదాసత్వము కూడనా.

పురు—సీ. పద్మబాంధవుఁడు మొదలు మా ♦ వంశమునకు
నేనె మావంశమునకంత ♦ నైనవాఁడ
రవికులము నేఁటితో సరి ♦ రాజ్య మిదిగొ
నైకొనుము వాకిరీటాది ♦ కంబులతోడ.

(అని నర్మదతలపై నున్నపాగ దీసి కిరీటము పెట్టబోవుచు) ఆహా! ఆహాహా! ఏమిది! ఆహాహా! ఏమి నర్మదా! హానర్మద?

గీ. మున్ను మూర్ధము ముద్దిడ ♦ నన్ను నేనె
ముద్దుగొనునట్లు గనఁబడె ♦ "ముదిత! యేమి?,!
యనిన "మాజాతివారికి ♦ మశిశి రంబు
నందు వెలుగొందు,,నని చెప్పి ♦ తపుడు నీవు.

గీ. అదిగో! మశి; నేను ముద్దుగొ ♦ న్నదియె యిచట
పాపటకు చిట్టచివరను ♦ ప్రతిభగాంచు
గాఢమోహంబునను దారి ♦ గాంచి యొక్క
దాని జేసినాడుచిత్తంబు ♦ కరఁగి.

(అనిగాఢముగ కౌఁగిలించుకొని) ఆహా! నీవునర్మదవే (తొందరతో నర్మదయొక్క కుడిచేతిని తనకుడిచేత బట్టుకొని) ఇదిగో నేనిచ్చినమతెయుంగరము. ఆహా! నర్మద! నీమతెయుంగర మిదుగో. నీచిటికెనవ్రేలును నాచిటికెనవ్రేలు నొక్కటిగ దగ్గర నుంచుము.

గీ. కరము కరమును జేర్పను ♦ గరము లిచట
దనరు కర్కటలగ్నజా ♦ తకుఁడనైన
నాకు గురుశుక్రు లిద్దఱ ♦ నారతంబు.
భాగ్యకోణంబునను జేరు ♦ భంగిఁగాఁగ.

విదూ—గురుఁడు షష్ఠాధిపతి గనుక కొంచెము కలహము గలుగు నని తలఁచెదను.

పురు—ఆహా! ప్రాణేశ్వరీ! నేను మహాదృష్టవంతుడను కద. ఇంక కొంచెమువశిష్ట మున్నది.

గీ. అంగి పాటకరింపఁగ నుబ్బి ♦ తొంగిచూచు
పిడిగానంగ ఫాకమల్ ♦ వేచియుండు

కంజముకుళంబులను నాచు ♦ గ్రమ్మఁగానఁ
బషక ఝుమ్మని విలపించు ♦ భ్రమరములన.

(అని బలవంతముగా నర్మదపై వంగీ తీసివేసినాఁడు.)

(నర్మద సిగ్గున నిలుచున్నది.)

విదూ—ఆహా! వయస్యా! కాటుకకన్నులవాఁడ వదృష్టవంతుఁడవు. ఎఱ్ఱగ వేగినబూరె నెలువగ బోపల తియ్యటిపూరణ మగపడిన ట్లు నీకవచమును తీసినవెంటనే యీసుందరవిగ్రహ మగపడినది.

పురు—గీ. ధన్యతను జెందినాఁడనో ♦ తరుణి! నిన్ను
మొదటఁగోల్పోయి యిపుడు న ♦ మ్మోద మెదను
దనరుగాంచుటచేత సు ♦ ధాకలశముఁ
దిరిగి గ్రహియించు నలసుర ♦ వరునికరణి.

నర్మ—నాథా! నాకు భయము వైచుచున్నది.

విదూ—అమ్మా! ఇంకను భయ మోనులకు? (అని నవ్వుచున్నాఁడు)

పురు—ఆహా! తిరిగి యెవఁడైన గ్రహింపఁకొనిపోవునని భయపడు చుంటివా?

గీ. గట్టిగను గాఁగిలించితి ♦ కాంత! మోద
వార్ధి మునిఁగితి మొకరి లే ♦ వంగ నెత్తి
వలనుపడ దిద్దఁజేగ్రహింప ♦ వశమగాని
గేలమున నెత్తు త్రాడుబా ♦ క్కనయుబోలె.

విదూ—అమ్మా! ఎలుకనుబట్టి పిల్లి యటుకమీఁదకు పారిపోవునట్టు నిన్ను గ్రహించి పైకి తీసికొనిన వాఁ డెవఁడు?

నర్మ—నాథా! ఇంద్రునియాజ్ఞచే చిత్రకేతుఁడనునాసోదరసమానుఁడు.

పురు—ఆలాగునా? ఇంద్రసభామంటపంబున నేను నిన్ను చూచియే ప్రతిమ యని భ్రమించితినా?

వర్మ—అవును. నాయెడల నీమోహ మెట్టిదో తెలిసికొనుట కావి చిత్రనాటకమునకు మిమ్మింద్రుఁడు పిలిపించినాఁడు. నీవు నాకొఱ కెంతవిలపించిన నేనింద్రునియాజ్ఞాబాధమున నుండుటచే—

పురు—ఆహా!

గీ. చిత్రమును నిన్ను నిన్నును ◆ చిత్రభంగి
నున్న నిన్నును మఱచూపుఁ ◆ గన్న నిన్ను
నన్నిమాఱులు గని భాగ్య ◆ హైన్యమునను
పోల్చ లేకుంటి నిప్పుడు ◆ బుద్ధిలేమిఁ
బ్రాఁతచదువులె క్రొత్తలై ◆ బఱఁగుఁ గాదె.

విదూ—నీవు గ్రహించలేకపోయితివిగాని నేనువెంటనే గ్రహించినాను.

పురు—(నవ్వుచు) ఎటులు?

విదూ—దేవతలకు రెప్ప లుండవుకాదా.

పురు—(నవ్వుచు) ఉండకపోవుట కాదు. తెప్పపాటు లేదు.

విదూ—అదే. అదే. ఈదొంగవైద్యుఁడు దొంగరోగి వయిననీతోడ పైఁగూర్చుండి కనులు మూసికొని దొంగజపము చేయుచుండ నేనుదొంగచూపులఁ జూచి యితఁడు దొంగపురుషుఁ డనుకొంటిని. ఏమీ! ఆసంగతి నీతో చెప్పఁబోవ యత్నించుచుండ నీ పెద్దకలకలముతో నాకన్నులు మూసికొనిపోయినవి. రాజా! ఎంతమాత్రమైన నెవరికైనఁ దోచ నిచ్చితివా! నన్నేమైనఁ జెప్పనిచ్చితివా! పత్తిరాట్టముముందు బంగారుపిచుకపలుకు యేమి వినఁబడుచు?

పురు—దేవీ! నేను యథార్థముగ చెప్పుచున్నాను. నాకొక్కటే ధైర్యము.

గీ. పురుషగతినుండ నాకనుల్ ◆ పోల్చకున్న
సహజముగ నాదుమది నిన్ను ◆ సరగ నెఱుఁగ

కున్న గాఢంపుమబ్బులో ♦ నున్న మిత్రు
దారి కనిపెట్టుసూర్యకాం ♦ తంబుభంగి.

విదూ—వంట యైనపిమ్మట పొయ్యి విశేషముగ మండినభంగిని యదృష్టమున సఫలుండ వయిననీబుద్ధి యిప్పుడు మిక్కిలి ప్రకాశించుచున్నదే.

పురు—(నవ్వుచు) ఛీ! వయస్యా! సిగ్గు లేక నన్నాక్షేపించుచుంటివా! నేనుపురుషుని వలచితి నని నాకు మతి పోయినదనియు, నితని మంత్రములునాతల కెక్కెననియు గింజుకొంటివి జ్ఞాపకము లేదా? నాయంతఃకరణము పరిశుద్ధమైనదో నీయంతఃకరణము పరిశుద్ధమైనదో కనిపెట్టితివా.

విదూ—నేను వద్దువద్దని చెప్పుచుండఁగా రాజ్య మితనికి గాదు. ఈమెకిచ్చెదనని గంతులువయిచితివే! ఏదీ! ఇయ్యగలిగితివా! ఎవరియంతఃకరణపారిశుధ్య మిందుగనుపడుచునేయున్నది. రాజా! పెండ్లిభోజనము దొరికినబ్రాహ్మణునిముఖమువలె నీముఖ మీదినము నవింతగ ప్రకాశించుచున్నది. రాజా! నాసంతోషమును పట్టలేకున్నాను. (గంతులు వైచుచు నవ్వుచున్నాఁడు.)
ఓ రాజా! ఓ దేవి! ఓ దేవీ! ఓ రాజా! అని కేకలు వేయుచున్నాఁడు. (అప్పుడు సుమతి ప్రవేశించుచున్నది)

సుమ—(తొట్రుపాటుతో రాజును కౌఁగిలించుకొని) ఎందులకు ఎందులకు రాజా! ఎటులుంటివి? (రాజును విదూషకుఁడును సంభ్రమపడుచున్నారు.]

నర్మ—అక్కా! పురుకుత్సున కారోగ్యమును కలుగఁజేసినయెడల నేను కోరిన దంత యిచ్చెద నని మంగళసూత్రముతో వాగ్దానము చేసితివి. నీకాంతునకు సంపూర్ణమైన యారోగ్య మిచ్చితిని. నేను, కోరున దేమనఁగా నీకాంతుని నాకీయుము.

విదూ—అయ్యో! దేవీ! ఒక్కపలచనివానికి పైనయొక్కమోస్తరు లో పల నొకమోస్తరు నని నేచెప్పినమాట వినకపోయితివి.

సుమ—(నర్మదవంక యెఱ్ఱబారజూచి) ఛీ! అవతలకు పొమ్ము నీ వెవ తెవు? అమృతహస్తున కిచ్చెదగాని నీకిచ్చెదనంటినా?

పురు—ఆ. అమృతహస్తుఁ డిదియె ♦ యమృతాధరయా నిదె
నేను వలచినట్లు ♦ నీకు నితఁడు
చెప్పుపొలతి యిదియె ♦ యిప్పు డీవిచ్చిన,
నియ్యకున్న, దీని ♦ కే నిజంబు.

సుమ—రాజా! నీకు నిశ్చయముగ నారోగ్యముగ నున్నదా!

పురు—నే నబద్ధ మెటు లాడఁగలను! ఇంతయారోగ్యస్థితి నాజన్మము లోనే నెఱుఁగను.

సుమ—రాజా! నిన్ను నేనిచ్చుటకు నా కేమియధికార మున్నది నర్మదా! ఈరాజు నా చేత నొకరి కియ్యఁబడునంతయస్వాతంత్ర్యము గలవాఁడనని యాతఁడు చెప్పినచో నీ వతనిని దీసికొన వచ్చును.

పురు—(తల వంచుకొని నవ్వుచు మాటలాడ కూరకుండెను.)

నర్మ—రాజా! ఎందులకింతదీర్ఘాలోచన చేయుచుంటివి! మాట లాడ వేల?

సుమ—మహాచక్రవర్తివి. సర్వస్వతంత్రుఁడవు. ఆలోచించి మాకీ మా టలాడుము.

పురు—(నవ్వుచు)
ఆ. ఏకకాంత యుండ ♦ నే నస్వతంత్రుండ
నిద్దఱుండ వేఱె ♦ యెన్న నేల?
నొక్కచిలుక వ్రాలి ♦ నొగి జోగుజొన్న వె
న్ననను జోడువ్రాలు ♦ ననువుగాఁగ.

సుమ—ఇంత యస్వతంత్రుండ వైననీమోము జూడరాదు. ఈమెను పురుషవేషమున నీవే తీసుకొనివచ్చి నన్ను వంచించితివి. (అని కోపమునపోఁబోవుచున్నది)

పురు—[ఆమె రెండుచేతులను బట్టుకొని] అయ్యయ్యో! నేనేకర్మమెఱుగను. దేవీ! నిష్కారణము కోపపడకుము నన్ను కటాక్షింపుము.

నర్మ—నాథా! నీభార్య నిన్ను నాకిచ్చినది. ఇఁక నీవటు పోవలదు. ఇటు రమ్ము. (అని చేయిపట్టుకొని లాగుచున్నది.)

పురు—(గడ్డముపట్టుకొని) నర్మదా! ఒక్కనిమిషము క్షమింపుము. సుమతీ! నేను నిర్దోషిని. నన్ను కటాక్షింపుము.

విదూ—(తనలో) జాగిలపుజోటిమధ్య నడుమ పంది చిక్కిన ట్లున్నది కదా (ప్రకాశముగా) అమ్మా! సుమతీ! ధర్మశాస్త్రనిపుణుఁడనైన నేనొకసంగతిఁ జెప్పఁబోవుచున్నాను. విను అజ్ఞతచేఁ జేయఁబడిన వాగ్దానము నెఱవేర్పఁదగినది కాదు. ఈనైగ్యాని నర్మదగా నెఱుఁగక నీవుచేసినఖరారు చెల్లఁదగినది కాదు ఈవ్యవహారము న్యాయసభ కెక్కవలసినదై యున్నది. కాని న్యాయాధిపతియైనరాజు ప్రతివాదికి పాక్షికుఁడు. ఈతఁడు నాయొద్దను మాఱ్చినయెడల—

పురు—ఛీ! ఊరకొమ్ము.

విదూ(నవ్వుచు) లోకువ నేనే కద.

పురు—(గడ్డముపట్టుకొని) సుమతీ! నేనుచెప్పినట్లు వినుము. నామర్యాదను గాపాడుము నర్మదా! నీవు కోపింపకుము.

గీ. ఇంతి! నీసొత్తు కేవల ♦ మేను గాను
సుమతి కేవలమును నీదు ♦ సొమ్ముగాను.

విదూ—(నవ్వుచు) రాజా చెప్పక పోయితివి! త్రికోణసంగ్రామమును ద్రోయుచుంటివా?

పుర — వరుస మీాదిద్దఱును నన్ను ♦ పంచుకొనుఁడు-
లలిని ప్రాక్పశ్చిమార్థగో ♦ ళములు వరుస
తరణికాంతిని గ్రహియించు ♦ దారిగాగ.

సుమతీ! నీకిష్టమేనా, ఓయురగలోకవాస్తవ్యా! ఇటురమ్ము ఇటురమ్ము. నీకును సమ్మతమేకదా!

[అంతట నురగ లోకాధిపతి యగు మందారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

గీ. ఒక్కగానొక్కకూఁతురు ♦ ముక్కపచ్చ
యైన నారనికన్నిక ♦ నేను కనుల
కఱవుదీరఁగఁ గాంచి సు ♦ ఖంబుఁ బడయ
మాయమై పోయె నేమందు ♦ మాయవిధిని.

ఆ. ఉరగలోకమెల్లఁ ♦ బొరిపొరి గాలించి
దానిఁ జూడలేక ♦ ధరణిఁ జేరి
యుంటి నిటను లేక ♦ యున్న స్వర్గమె నాకు
దిక్కు గాని యేమి ♦ దిక్కు గలదు?

ఆ. కాని యొక్కగాలి ♦ కబురు నాచెవిఁ బడె
చక్రవర్తియింట ♦ చాన గలద
టంచు వానిభార్య ♦ యగుటకు వచ్చెనో?
కాకయున్న నేమి ♦ కారణంబు?

ఆ. పండువంటికులము ♦ భస్మమై పోవఁగ
సిగ్గువిడిచి మగనిఁ ♦ జెందఁ గోరి
యూరనూరఁ గాక ♦ నొగి లోకములనెల్ల
దిమ్మరిల్లుచుండె ♦ బమ్మరాఁత.

ఆ. మల్లెపూలదండ ♦ మర్కటగళమునం
దెట్టులుంతు ననుచు ♦ నింతజాడ్య

ఘను జేయవలసె ♦ దానికి నెనయైన
వరుఁడు వెదుక వెదుక ♦ దొరుకకుంట.

ఆ. ఎదిగినట్టిబిడ్డ ♦ యింటనుండఁగఁ గొంచె
మటును నిటును గలుగు ♦ వటునిఁ జూచి
త్వరగ ముడినిబెట్టి ♦ వారిఁ గూర్పనియట్టి
కుమతి ముక్కు చెవులుఁ ♦ గోయవలయు.

ఆ. మాకు సంతు లేదు మా ♦ కర్మ మని కుళ్ళి
మూల్గుచుండ్రు పుట్టి ♦ మునిగినటులు
పిల్ల లున్న నేమి ♦ యిల్లుఁ గూల్చెడువారు
చేటుఁ బడుట కడుపు ♦ చేటు గాదె.

దైవమా! ఏమి చేయవచ్చును. ప్రారబ్ధ మనుభవించక తీఱునా ఈచక్రవర్తియొక్క మందిరమునకు పోయెదను. ఆహా!

ఆ. అతఁడు నేనుసముల ♦ మైననాతనియింటి
కేను బిలువకుండ ♦ నేగుచుంటి
పిల్లకొఱకుఁగాదె ♦ వెత లిన్ని బడనయ్యె
కడుపువంటితీపి ♦ కలదె యొకటి?

ఇదిగో రాజమందిరము. ద్వారరక్షకా!

సేవ—అయ్యా!

మాంధా—మీరాజును జూడ మఱియొక రాజు వచ్చె నని చెప్పుము.

సేవ—చిత్తము. (అని యామాటలనే చెప్పుచున్నాఁడు)

పురు—ఏమీ! మీరాజునుగూడ మఱియొకరాజు వచ్చె నని చెప్పెనా! నాకధీనులైనభూలోక రాజన్యులలో నెవ్వఁడు నింతగర్వి చినవాఁడు లేఁడే. ఏమీ! ఏరాజయ్యెను? వచ్చెను యిష్టగోష్ఠికా? యుద్ధమునకా? ఎవరైన నేమి? ఎందులకైన నేమి? తీసుకొనిరమ్ము.

సేవ—(వచ్చి) అయ్యా! తాము లోనికి రావచ్చును.

(మందారుఁడు లోనికిఁ బ్రవేశించెను.)

నర్మ—(పరుగెత్తుకొని వచ్చి కాళ్ళపైఁ బడి) తండ్రీ! క్షమింపుము! తండ్రీ! కటాక్షింపుము!

మందా—ఛీ! దుర్మార్గురాల!

ఆ. తండ్రి చచ్చె ననుచు ♦ దలఁచితివే! నీవు
భయము లేకసిగ్గు ♦ బారదోలి
మగనికొఱకు నీవె ♦ మహినెల్ల దిరిగెదు
కాలుగాలుపిల్లి ♦ కరణిగాగ.

ఛీ! దుష్టవర్తనురాలా! నావెంటరమ్ము (అని నర్మదను బలాత్కారముగా చేయి బట్టుకొని తీసుకొనిపోఁబోగా.)

పురు—(అదరిపడి కత్తి చేతబూని) ఓహో! ఇతఁడు నామామ కాఁబోలును! అయిననేమి!

క. ప్రాణము బోయినపోనీ
మానిని దక్కించుకొనెద ♦ మరి శూరుఁడిలన్
ప్రాణము పోయిన పోనీ
మానము దక్కించుకొనిన ♦ మాడ్కిన్ వేడ్కన్.

ఛీ! మూర్ఖుఁడా.

ఆ. కత్తి వ్రేటు దినెదో? ♦ కాంతను విడిచెదో?
మామ వగుట రెండు ♦ మార్గములను
జూపినాఁడ గాని ♦ చూపుతో నాకత్తి
మెట్టిబారవలయు ♦ నిట్టితెరిని.

మందా—ఛీ! చోరుఁడా! ఛీ! మాంత్రికుఁడా!

ఆ. మాయమంత్రములను ♦ మాబిడ్డ నురగలో
కంబునుండి లాగ ♦ గలిగితివిర

యింద్రజాలి కేంద్రుఁ ♦ డవనిలో నున్నట్టి
ధనపుఁ బ్రాంతుఁ బైకిఁ ♦ దార్చుకరణి.

గీ. మించుకన్నెల సిగ్గు హ ♦ రించుటకునె
బ్రహ్మ యీరాజ్యమును నీదు ♦ పాలు జేసె?
పండ్లు దిని పూలఁ దాల్చుచుఁ ♦ బ్రబలుటకునె
వనము కాపరిగ నైనట్టి ♦ వానికొలువు?

గీ. నీవు నాకూఁతు హరియింప ♦ నేను దాని
గొంచుపోవుట తప్పుగ ♦ నెంచితివిర!
దొరనుమించిన యధికారి ♦ దొంగఁజేసి
యిట్టులే గ్రుడ్డిగా రాజ్య ♦ మేలుచుండె?

ఛీ మూర్ఖుఁడా! నేనునాకూఁతును విడువను. చేతనైనయెడల యుద్ధమునకు రమ్ము.

పురు—అవశ్య మిదిగో వచ్చెదను. వయస్యా! ధనుర్బాణముల నిటు దెమ్ము. సేవకా! కవచముఁగూడ శీఘ్రమున నాయత్తపఱుపుము.

మందా—ఇదిగో నేనును గూడ యుద్ధమునకు సిద్ధపఱుచుకొనుచున్నాను. అవశ్యము తగుస్థలము చూచి యిప్పుడే యుద్ధ మారంభించెదము.

సుమ—నాథా! యుద్ధ మెందులకు శాంతింపుము.

పురు—(కోపముతో) నేను బ్రతికియుండుట నీ కిష్టములేదా!

నర్మ—తండ్రీ! కత్తిదూయనేల కటాక్షింపుము.

మందా—ఛీ! పాంసులా! నోరు మూసికొని నీ వచ్చట దూరమున కొంతసేపు కూర్చుండుము.

నర్మ—(కొంచెము దూరముగ పోయి తనలో)
ఆహా భగవంతుఁడా! ఇప్పటికైన నన్ను గట్టెక్కనియ్యక పోయి

తివా? ముందునుయ్యి, వెనుకగొయ్యి, మధ్యనన్నుంచితివా? ఒకవైపున తండ్రి, యొకవైపున పెనిమిటి. ఎవరిమాటవిందును? ఎవరిమాట వినకపోదును? ఇద్దఱు నొకరిపై నొకరు నాకొఱకు కత్తులను దూసుకొననున్నారు. ఓతండ్రీ! అనేకతపములను జేసి నన్ను గాంచి పదునాలుగేఁడు లల్లారుముద్దుగఁ బెంచిననీవు బహుకష్టములఁ బడి మూఁడులోకములు దిరిగి యేడ్చి యేడ్చి మహాచక్రవర్తి శిఖామణిని చెట్టఁబట్టి వానిప్రక్క నుండఁగ నన్ను బలాత్కారముగ నూడఁబెరికి యిట్లు నాగొంతుఁ గోసెదవా? విశ్వామిత్రశాపమునలన దపించి యధోలోకమునఁ బడినన్ను గాంచి ప్రేమించి నాకొఱకు కింటికిమంటి శోకధారగ నేడ్చి దుఃఖభారమున రోగపడి చివరకు నన్నుఁ గాంచుటకు ఫలము; ఓనాథా! ఓమహాచక్రవర్తి! నాతండ్రియు నీమామయు నైన యీవృద్ధమహారాజుయొక్క రక్తమున నీయొక్కవస్త్రములను దడుపుకొనుటయేనా? అయ్యయ్యో! మీయిద్దఱిరక్తమును నా పెండ్లికాలమందు వసంతోత్సవ మగునా? నాథా! అల్లుఁడు మామకు నమస్కరింపవలెగాని కత్తినిబూడుచునా. ఓతండ్రీ! నీకత్తి ప్రేటులా నీయల్లునికిదీవెనలు? ఓనాథా నాజన్మమునకు కారణమైననాతండ్రియొక్కరక్తముతో తడిసిన చేతులతోనా నాకుమంగళసూత్రధారణము చేయదలఁచితివి? ఓతండ్రీ నానాథుని జంపిన చేతులతోనా నన్ను తిరిగి యురగలోకమునకు గొనిపోదలఁచితివి? ఓహో! భగవంతుడా! ఏమి దిక్కు యేమి చేయుదును! ఏది గతి! అయ్యో! నాథా! నీవుగాని, అయ్యో! నాతండ్రీ! నీవుగాని మీరిద్దఱొకసారిగాని నాకనులయెదుట చావకమునుపే యింతముప్పునకు కారణమైననే నంతమునొందుట మంచిది కాదా! తండ్రీ! నీవునాజన్మమున కొట్టికారణ మై

తివ్రా, నాచావునకు కూడ, నిట్టికారణమే యైతివి సుమా! నాథా! నీయెదుట నీకొఱకే చచ్చుచుంటినిసుమా! ఇంతకష్టపడి నిన్ను లభింపచేసుకొనినందులకు నొక్కసారి గట్టిగ నిన్ను కౌగిలించుకొనకే చచ్చిపోవుచుంటినిగదా ఇంద్రా! మృషావాదీ! నీపెనిమిటితో నిన్నుఁగూర్చెద నని చెప్పితివే! ఏదీ! ఓశచీ! మగవాలా! నీమాటకూడ యబద్ధ మయ్యెనుకదే! తండ్రీ! పెండ్లికాలమందు నాకు గొంతు త్రాడా యరణ మిచ్చుచుంటివి? ఓసూర్యభగవానుఁడా! నీయింటికోడలిని కావలెనని నే నెంత యేడ్చినను నాకు స్వాధీన మైనది కాదుగదా. ఓపురుకుత్సా! ముందుజన్మమునసైనను నీవే నాకుభర్తవు కావలెనుసుమా! అయ్యో! చంపుకొనుట కిచ్చట నేమున్నది. గ్రుక్కెడుప్రాణ మదెంతసేపు పోవలెను. ఇదిగో నానాథుని కరస్పర్శచే పరమ పూజ్యమైనయీపైఁటకొంగున గొంతున కురి పోసుకొనెదను. అయ్యో! అయ్యో! గళసూత్రయోగమే కాని మంగళసూత్ర యోగము లేదయ్యెనా? (కొంగున కన్నుల కద్దుకొని) తండ్రీ! నమస్కారము. నాథా! నమస్కారపూర్వకముగా దూరమున నుండి కన్నులచేతనే కౌఁగిలించుకొనుచున్నాను. హా ఇంద్రా! మాయకాఁడా నీవలనచెడితిని (గొంతుక కురిపోసికొని) హర హరా! హర హరా! (అని నేల వ్రాలుచున్నది.)

[అప్పుడు శచీదేవేంద్రులాకాశయానమునఁ బ్రవేశించుచున్నారు.]

ఇంద్రు—నర్మదా! నర్మదా! ఆఁగుము. ఇంద్రుడు మృషావాదికాఁడు. లెమ్ము నర్మదా లెమ్ము.

నర్మ—(అదరిపడిలేచి) మహేంద్రా! నమస్కారము! నాపెనిమిటిని నాకు దయచేయుఁడు.

ఇంద్రు—(నవ్వుచు) అందుకొఱకేగద వచ్చితిని.

శచి—(నవ్వుచు) నర్మదా! ఇల్లాలిమాట యసత్యము కాలేదుకదా.

నర్మ—(నమస్కరించి) తల్లీ! క్షమింపుము.

ఇంద్రు—పురుకుత్సా! ఏమీ ఈవింత! ఆతనికూఁతురు నీప్రక్కను, నీకత్తియతనిప్రక్కనా? చాలు చాలు! మామగారిని శిక్షించునంతటిమహాగుణ మీశ్వరభక్తివలన గలిగినది కాఁబోలు నేమి? చాలుఁ ఊరకుండుము.

పురు—పురందరా! నమస్కారము తమయిష్టానుసారమే నడుచువాఁడను.

మందా—పురందర! నమస్కారము.

ఇంద్రు—కళ్యాణమస్తు! మందారా! నీవు నాకు స్నేహితుఁడవును నేను చెప్పినట్లు వినువాఁడవే కద.

మందా—తులసీదళమునువలె తమయానతిని శిరమున ధరింతును.

ఇంద్రు—అటులైన వినుము. నాకుపుత్త్రసముఁడగుమాంధాత పరలోకగతుఁడగుటచే అతనికుమారుఁడైన పురుకుత్సునకు నేనే తండ్రివంటివాఁడను. నర్మదకుఁదగిన వరుఁడు పురుకుత్సుఁడే. వారిదాంపత్యమువలన మనమిద్దఱము వియ్యమందవలసి యున్నది. వీరిద్దఱిని సంఘటన జేయుటయందు నీ ప్రధాని యగు నంశుమంతుడును నాసఖుఁడగు చిత్రకేతుఁడును నేనునుగూడ మిక్కిలి శ్రమ చేసితిమి! అంశుమంతుఁడాకస్మికముగ మరణించుటచే పాపమీసంగతి నీకుదెలియనందులకు విచారించుచున్నాను.

మందా—మహానుభావా! తమయిష్టప్రకారమే నడువవలసినవాఁడను. సెలవైనయెడల నురగలోకమున వివాహ మొనరింతును.

ఇంద్రు—(నవ్వుచు) మిత్రమా! నే నెచ్చటనుండ నదియే యింద్రలోకము. నీవెచ్చటనుండ నదియే యురగలోకము. ఈపురుకుత్సునిది భూలోకమేకద! మూఁడులోకము లిచ్చట సమావేశ మైనవి. వివాహమునకు నింతకన్న తగినస్థలమేది.

విదూ-ఆలస్యమెందులకు నేను బ్రహ్మనై, ఇప్పుడే వివాహము చేయించెదను

విశ్వా—(ప్రవేశించి) ఆఁగు ఆఁగు ఇదిగో! పురుకుత్సుఁడు చెప్పినట్లు వ్యతిరేక "బ్రహ్మ,, నైన నేను వచ్చుచుంటిని. పురుకుత్సా! ఇప్పు డునాశాపమునకు విమోచనము కలిగినది.

సీ. "బ్రహ్మసృష్టించు నిక్ష్వాకు ♦ వంశజులకు
సురలలోకమె గతి యింత ♦ వఱకునీవు
భళిర తద్వ్యతిరేకపు ♦ బ్రహ్మవగుట
నా కధోలోకగతి యిచ్చి ♦ నావు కావె,,

అని నన్నాక్షేపించితివి జ్ఞాపకమున్నదా?

పురు—(నమస్కరించి) అయ్యా! క్షమింపుము.

ఇంద్రు—గాధినందనా ఇంద్రుఁడు నమస్కరించుచున్నాఁడు.

విశ్వా—కళ్యాణమస్తు.

మందా—విశ్వామిత్రా! మందారుఁడు నమస్కరించుచున్నాఁడు.

విశ్వా—కళ్యాణమస్తు! వివాహముహూర్తము సమీపించుచున్నది. సూర్యోదయ మైనవెంటనే సుముహూర్తము. అదుగో భాస్కరుఁడుదయించుచున్నాఁడు.

సీ. అల్లుఁడో నీదుపా ♦ దాబ్జంబు లీతఁడు
గడుగఁ దెచ్చినరత్న ♦ కలశ మనఁగ
కన్యాప్రదానస ♦ త్కాలంబునను నీకు
గట్టెదు మేల్పాసి ♦ కంబనంగ
వియ్యంకు లొకరిపై ♦ వేడ్క నొక్కరు జల్లఁ
బట్టిన బగ్గుండి ♦ పళ్లెమనఁగ
(నర్మదవంకదిరిగి)
ప్రోక్షతి నీదుసా ♦ భాగ్యవృద్ధి కొనంగు,
బంగారుకుంకుమ ♦ బరిణెయనఁగ.

(పురుకుత్సునివంకఁజూచి)

గీ. పరిఢవిల్లుచుభవదీయ ♦ వంశనాథుఁ
డై నరవిపెండ్లిపెద్దయై ♦ యలరుకతన
వచ్చెఁజూడఁగననదే ♦ ప్రాగ్ధరమునఁ
బొలుచునత్యుత్తమప్రభా ♦ పూర్ణుఁడగుచు.

పురు—ఓప్రభాకరా! నమస్కారము.

విదూ—వయస్యా! ఈసూర్యునిఁజూచి నీకునమస్కరించవలెనని బుద్ధిపుట్టినదికాని పెండ్లి యరిసెవలెనుండుటచే నీతనినోటఁబడవైచుకొనవలెనని నాకు బుద్ధిపుట్టుచున్నదిసుమా.

విశ్వా—పురుకుత్సా! నర్మదా! మంగళస్నానగౌరీపూజాదులు చేయించవలసియున్నది. మీరులోనికిరండు. మందారా! కన్యాప్రదాతవు. నీవుకూడరమ్ము. (పురుకుత్సుడు, నర్మదయు, సుమతియు, విదూషకుఁడును, విశ్వామిత్రుఁడు, మందారుఁడును లోనికిఁబోవుచున్నారు.)

ఇంద్రు—శచీ! భగవంతుఁడనుకూలదాంపత్యము నేడుకూర్చినాడుసుమా.

శచి—సందేహమేమి!

(విశ్వా, పురు; నర్మ, మందా, విదూ, ప్రవేశించుచున్నారు.)

విశ్వా—పురుకుత్సా! పితృసమానుఁడగునింద్రునికి నీయిద్దరుభార్యలతోను నమస్కరించుము. (పురుకుత్సుఁడు నమస్కరించుచున్నాఁడు.)

ఇంద్రు-గీ. భార్యలిద్దరునిన్గొల్వఁ ♦ బరమభక్తి
శాశ్వతంబుగనిలయేలు ♦ చక్రవర్తి
శ్రీసతియుభూసతియుపాద ♦ సేవఁజేయ
విమలదయలోకములఁబ్రోచు ♦ విష్ణుభంగి.

నీమామగారికి నమస్కరింపుము. (పురుకుత్సుడు నమస్కరించుచున్నాఁడు.)

మందా—పురుకుత్సా!

గీ. వీరినిద్దరి నొకరీతి ♦ గారవమున
గాంచి ప్రతిభాధికతనీవు ♦ గాంచుమయ్య
భవ్యభవదీయవంశాధి ♦ పతియగురవి
మెలమిభార్యాద్వయంబుతో ♦ నెసఁగినటుల.

ఆ. ఉరగకాంతనీకు ♦ నువిదయూటనునీదు
చరితవినెడుచదువు ♦ నరులకెప్పు
డురగభయము లేక ♦ నుండునట్లుగ నేను
వరమునిచ్చినాఁడ ♦ వత్సనీకు.

ఇంద్రు—గాధినందనా! తాముఁగూడ నేమైన నీతనికివరమొసంగదరా!

విశ్వా—(నవ్వుచు) నాయాశ్రమమందు దుష్టినిచంపినయప్పుడే యూత నికివరంబిచ్చితి. ఐనను నర్మదా!

గీ. మున్నురగలోకమందున ♦ భువినిపిదప
దివినితరువాతనటుమీఁద ♦ భువినిదిరిగి
యుటనెమైదవపరిపతి ♦ నెనయునీకు
నైదవతనంబు శాశ్వతం ♦ బౌనుగాత.

పురు—అయ్యా! ఋషిసత్తమా! ఇంద్రాదిదేవతలదర్శించియు తిరిగిభూలోకమునకువచ్చి సూర్యసమానుడగు పుత్త్రునిగాంచి సుఖింతువని దాము నాకు సెలవొసంగిరి. అంతయును నెరవేరెనుకాని—

విశ్వా—(నవ్వుచు) నీతాతయువనాశ్వుఁడు సంతానముకొరకింద్రియాగమును జేసి నీతండ్రియగుమాంధాతనుగాంచెను. అతనికి ఇంద్రయాగమునందుగాని ప్రత్యక్షముగాని దేవేంద్రుఁడు నీమహాదృష్టవశమున నిప్పుడే శచీసహితుఁడై ప్రత్యక్షమయ్యెను. నీచేత నిప్పుడింద్రయాగమును జేయించుకొనఁ కేవచ్చియుంటిని. యాగదీక్షితుఁడవుగమ్ము. నీకుసంతానము కలిగినదనే భావింపుము.

పురు—మహేంద్రా! తమసెలవుగూడ దయచేయఁబడునుగాక.

ఇంద్ర—అవశ్యముచేయుదును. ఇకనిక్కడ నవశిష్టమేమున్నది.

విదూ—(నిలుచుని)అయ్యా! అయ్యా! యింకొకచిన్న యవశిష్టమున్నది. హోమమొకటి చేయవలసియున్నది.

విశ్వా—హోమమెందుకు?

విదూ—క్షమించినచో చెప్పెదను.

ఇంద్రు—క్షమించితిని. చెప్పుము.

విదూ—(తానుదూరముగానిలుచుండి) హోమమెందుకు చేయవలె ననగా (ఒకటిరెండు అనియేడువరకులెక్కపెట్టి) ఈసప్తగ్రహ కూటమువలని బాధప్రపంచమునకు లేకుండుటకొరకు—

పురు—(మహేంద్రా) అవశిష్టమును నాయానందమునకు మితియును గూడలేదు. ఐననిటులకోరెదను.

గీ. ధరణియీతిబాధలు లేక ♦ దనరుగాక
ప్రజలయన్యోన్యవైరముల్ ♦ వాయుఁగాక
కవితరాజపోషణమున ♦ గ్రాలుఁగాక
నీతిపాలనమునరాజు ♦ నెగడుఁగాక.

ఇంద్రు—తథాస్తు.

విశ్వా—తథాస్తు. తథాస్తు.



పంచమాంకము,

సర్వముసంపూర్ణము.